

Sri Jayendra Saraswathi , Sri Chandrasekharendra Saraswathi , Sri Vijayendra Sarasw

# శ్రీ కంచి పరమాచార్య లీలలు

## ( జగద్గురు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామి వారి లీలలు -1 )

సేకరణ, సంకలనం :

**నాగేష్ కానూరు ( Nagesh Kanuru )**

**ప్రథమ ముద్రణ : October 2019**

**ప్రతులకు :**

**1. శ్రీ కంచి కామకోటి పీఠం**

No .1 , Salai Street ,

కాంచీపురం – 631502 తమిళనాడు

**2. శ్రీ సాయి మాస్టర్ సేవా ట్రస్ట్**

సాయి మాస్టర్ నిలయం ,గొలగమూడి – 524321

నెల్లూరు, ఆంధ్రప్రదేశ్

**3. నాగేష్ కానూరు**

2nd floor ,రాజగోపాల్ బిల్డింగ్ ,గొల్లహళ్లి

ఎలక్ట్రానిక్ సిటీ పోస్ట్ , బెంగుళూరు- 560100

naageshk23@gmail.com

**ముద్రణ :**

మనోజ్ ప్రింటర్స్

3-2-342 & 343, చెప్పల బజార్,

కాచిగూడ , హైదరాబాద్ , సెల్: 9246887388

**వెల : రూ. 40/-**




నా గురుదేవులు :

శ్రీ పెసల సుబ్బరామయ్య గారి పాద పద్మములకు అంకితం.

అపారమైన కరుణతో తనదగ్గరకు రప్పించుకుని అనంతకృపను, మహిమలను చూపించిన నా గురువుగారు శ్రీ పెసల సుబ్బరామయ్య గారు గొలగమూడిలోఉండేవారు .

తనశరీరము ఉన్నంతవరకు కఠోరనియమపాలన, అపరిగ్రహం, గురుసేవ, భగవద్భక్తులసేవ, చేసి ఎంతోసామాన్య జీవితాన్నిగడిపి, అతిగోప్యంగా తన మహిమను ఉంచేవారు. మహనీయుల సేవలోనే, కేవలం దేవుడిపైన ఆధారపడి జీవితాన్నంతటినీ గడిపారు.పరమాచార్యులనుదర్శించారు.భగవద్భక్తులకై"జ్ఞానేశ్వరి","అవధూతవెంకయ్య స్వామి" వంటి ఎంతోమంది మహనీయుల లీలలనుప్రచురించారు. తనకు ఉండే చిన్నఇంటిని కూడా భాగాలు చేసి భక్తుల నివాసానికై కేటాయించారు .

మన ఇష్టా-యిష్టాలు ధర్మానికి లోబడి ఉండాలనేవారు. తనను ఆశ్రయించిన వారికి అలాఉండేటట్లు శారీరక, మానసిక, నైతిక శిక్షణఇవ్వటంలో ఏరకమైన మొహమాటానికీ లొంగేవారు కారు." **ఈసృష్టి అంతా గురుపాదాలు. అందులో ఎక్కడసేవించినా అది ఆయనకు చేసే సేవే అవుతుంది** ." అనిఆచరించి,బోధించారు. వారి జీవితమంతాకూడా కఠోరనియమపాలన,కృతజ్ఞత,అపరిగ్రహం,సేవ,పుణ్యకర్మలు,సత్సంగం, గ్రంధరచనలతోనే గడిచింది.

పరమాచార్యుల వారి ఈలీలాసంకలనం మరింత గురుకృపను ప్రసాదించాలని ప్రార్థిస్తున్నాను .....

**నాగేష్ కానూరు**

**విన్నపము**: ఈపుస్తకంలోని లీలలు,ఇతరవిషయాలన్నీఉత్తములైన కొందరుభక్తులు రచించిన గ్రంధాలలోనుంచి,ఇంకా ఇంటర్నెట్లో లభ్యమైన సమాచారం,శంకరమఠంవారి వెబ్ సైటు,ఇతర వెబ్-సైట్లు మరియు అలాంటి సాహిత్యాలలో నుంచి గ్రహించి కూర్చినవి మాత్రమే. ఏమైనా తప్పులు గమనించినట్లైతే సహృదయంతో మన్నించమని ప్రార్ధన .

**గమనిక** : ఎంతోమహిమాన్వితమైన శ్రీ ఆదిశంకరులు రచించిన కనకధారాస్తోత్రం మరియు అన్నపూర్ణాస్తోత్రం చివరిలో ఇవ్వబడ్డాయి.

# కాంచీపురం – కంచి పీఠం

చెన్నై( మద్రాసు) కి 74 కి.మీ. దూరం లో ఉన్న కాంచీపురం లో , శ్రీకంచి కామకోటిపీఠం క్రీస్తుకు పూర్వం 482సం.ల క్రితం (ఇప్పటికి2500సం.ల.కు ముందు ) ఆదిశంకరులవారిచేస్థాపించబడింది(Ref:http://www.kamakoti.org/peeth/origin.html).అప్పటి నుంచి నిరంతరాయంగా ఈ ప్రపంచానికి వెలుగైన 70మంది అద్వైత శిఖరాలైన ఆచార్యులకు నెలవై విరాజిల్లుతుంది. ప్రస్తుతం పీఠాధిపత్యం వహిస్తున్నవారు శ్రీ శంకర విజయేంద్ర సరస్వతులు 70 వ ఆచార్యులు . వీరి గురువులు పుజ్యశ్రీ జయేంద్ర సరస్వతి స్వామివారు , వీరి పరమగురువులు- 'నడిచేదేవుడు', 'పరమాచార్యులు' గా ప్రసిద్ధి పొందిన శ్రీ చంద్రశేఖర సరస్వతీస్వామి వారు. వారి గురించిన లెక్కలేనన్ని లీలలు నక్షత్రాలు గా శాశ్వతంగా మెరుస్తుంటాయి. అతి కొద్ది లీలలను సేకరించి ఈ పుస్తకంలో పొందుపరచడం జరిగింది.

శంకరాచార్యుల పాదస్పర్శతో పునీతమైన ఈనేల ఐన కంచిమోక్షదాయిని అయిన నగరంగా ,ప్రసిద్ధమైన పుణ్యక్షేత్రంగా పేర్కొంటారు,సప్త మోక్ష పురులలో ఒకటి ( అయోధ్య , మథుర, మాయ ( హరిద్వార్),కాశి ,కంచి, అవంతిక ( ఉజ్జయిన్ ) ద్వారక – సప్త మోక్షపురులు ). మేలురకమైన పట్టు చీరలకు కొన్ని వందలు సం.లునుంచి కాంచీపురం ప్రసిద్ధి చెందింది.

పురాణాలలో కంచిమహాపట్టణం మహర్షులకే ఒక తీర్థయాత్రా స్థలంగా చెప్పబడింది . '**ఉమాసంహిత**' లో వ్యాసులవారు నందికేశ్వరుల వారి శాపానికిగురి ఐనప్పుడు మహావిష్ణువు, అతనికి శివుడిని ఆరాధించమంటారు . వ్యాసమహర్షి వారణాసి నుంచి బయలుదేరి , కాంచీపురానికి చేరుకొని శివుడుని తన శాపవిమోచనానికై ప్రార్థిస్తారు . అతనికి శాప విమోచానానికి గుర్తులుగా వ్యాసముని చేతులు పైకి ఉన్న , తరువాత సాధారణ స్థితిలో ఉన్న శిల్పాలు ఇక్కడి ఆలయగోపుర విమానంలో చూడవచ్చు. భాగవత పురాణం లోను , మార్కండేయ పురాణంలోను కంచి గురించి ఇతోధికంగా చెప్పబడింది. బ్రహ్మాండ పురాణం లో కంచి , కాశి క్షేత్రాలు పరమశివుని రెండు నేత్రలుగా అభివర్ణింప బడ్డాయి.

కంచి పట్టణమంతా దేవాలయాలమయం, కొన్ని వేలకొలది దేవాలయాలు ఉన్నాయి . అందులోముఖ్యమైనవి:కామాక్షి,ఎకామ్రనాథ ,వరదరాజ ,కైలాసనాథ ,వైకుంఠపెరుమాళ్ , ఉలకలంత పెరుమాళ్ ఆలయాలు. ఈ పట్టణంలో ప్రధాన దేవత కంచి కామాక్షి అమ్మవారు .

ఇక్కడ ఆరాధించే శివలింగం పృథ్వీ లింగం. జ్యోతిర్లింగాలలో ఒకటి . ఈ లింగాన్ని సాక్షాత్తు పార్వతీదేవి మట్టితో తయారుచేసి స్థాపించింది . మట్టితో కాబట్టి ఈలింగానికి అభిషేకం ఉండదు . ఆదిశంకరులు దేశంలో చాలా ప్రాంతాలు పర్యటించిన తరువాత కంచి లో ఒక పీఠాన్ని ఏర్పాటు చేసి ఆ మఠాన్ని తానే అధిష్టించారు .

## శ్రీ ఆది శంకరులు

కాలప్రవాహంలో వైదికమతం లో ప్రాంతీయ ఆచారాలతో ,సిద్ధాంత విభేదాలతో, అనైక్యతతో పాటు అనేక దురాచారాలు ప్రవేశించాయి . ఆలోపాలను ఎత్తి చూపుతూ వైదిక మతాలను నిరసిస్తూ వ్యతిరేకంగా అనేక ఇతర మతాలు ముఖ్యంగా జైన, బౌద్ధ మతాలు ఎదురుదాడి చేస్తున్నాయి . వేదాల ఉనికికే ప్రమాదం ఏర్పడిన ఆపరిస్థితుల్లో ఆది శంకరులు బౌద్ధ , చార్వాకాది 108 మతాలను ఖండించి వారిని తన జ్ఞానం తో జయించి అద్వైతమే వైదిక మతపరమావధిగా అద్వైతమతాన్ని స్థాపించారు .

వీరు శరీరంతో జీవించింది కేవలం 32 సం.లు. నేటికి 2500 సం.లకు పూర్వం ఇప్పటి కేరళ రాష్ట్రంలో కాలడి గ్రామంలో శివగురు , ఆర్యాంబ పుణ్యదంపతులకు జన్మించారు. శంకర భగవత్పాదులు అపర ఈశ్వరఅవతారం. జ్ఞానులందరికీ చక్రవర్తి. వీరి అద్భుతమైన లీల ఒకటి జగమెరిగినదే – బాల శంకరులు భిక్ష కోరినపుడు ఒక ఇల్లాలు ఇంటిలోఅంతా వెదికి ఏమీలేక ఒక ఎండిపోయిన ఉసిరికాయను మాత్రం ఇస్తుంది . ఆమె నుదిటిపై ఉన్న దారిద్ర్యరాతను చదివి శంకరభగవత్పాదులు జాలిచెంది **శ్రీ మహాలక్ష్మిని కనకధారా స్తోత్రంతో** ( చివరి పేజీలలో ఇవ్వబడింది ) స్తుతిస్తారు . అమ్మవారు ప్రసన్నం చెంది ఆ ఇల్లాలి ఇంట్లో బంగారు ఉసిరికాయల వర్షం కురిపించారు.

శంకరులు శ్రీ గోవింద భగవత్పాదుల వారిని గురువుగా స్వీకరించి వారి ఆదేశా నుసారం అద్వైతవిద్య బోధిస్తూ వారణాసి చేరుకుంటారు. అక్కడ ఉండే కాలంలో వ్యాసులవారిబ్రహ్మసూత్రాలకు,భగవద్గీతకుభాష్యాన్నిరచించారు.ఒకనాడు వృద్ధునిరూపంలో వ్యాసమహాముని శంకరులతో తీవ్రంగా వాదిస్తారు . ఆ సమయంలో శంకరుల శిష్యులు శ్రీ పద్మపాదుల వారు వచ్చినవారు వ్యాసులనితెలియపరచగా శంకరులువారికి ప్రణమిల్లుతారు . శంకరుల జ్ఞానానికి, భాష్యానికి సంతోషించి వ్యాసులవారు ఆశీర్వదించి అనుగ్రహిస్తారు .

వారణాసిలో ఒకసారి విశ్వేశ్వరుని దర్శించుకొని వస్తుండగా ఎదురుగా ఒక ఛండాలుడు 4 కుక్కలతో వస్తారు . అతనిని అడ్డు తప్పుకుని దారి ఇమ్మని శంకరులు అంటారు .ఆ ఛండాలుడు అద్వైత సారాన్నంతా తెలియపరుస్తూ ఇలా ప్రశ్నించారు : " ఓ విద్వత్తు కలిగిన బ్రాహ్మణుడా ! **ఏది, దేనినుంచి, ఎక్కడికి వెళ్ళాలి ? ఆహారంతో తయారయిన ఈ సజీవ శరీరం వెళ్ళాలా ? లేక సజీవమై ఉన్న ఈ చైతన్యాన్ని వేరుగా వెళ్ళమంటున్నావా ? దేనిని భేదించమని అంటున్నావు ?"** నిరుత్తరులైన శంకరాచార్యులు వారిని సాక్షాత్తు శివునిగా గుర్తిస్తారు .అధ్బుతమైన **'మనీషాపంచకం'** తో వారిని స్తుతిస్తారు. శంకరుల హిమాలయ యాత్రగురించి విశేషంగా చెప్పబడిన విషయాలు ఉన్నాయి . వారు హిమాలయాలలో కైలాస నివాసి ఐన శివుడిని,పార్వతీమాతను దర్శించాలని యోగశక్తితో అక్కడకు చేరుకుంటారు . ఆ ఆదిదంపతులను స్తుతించి శివుని ఆశీస్సులతో పాటు ఐదు స్పటిక లింగాలను పొందుతారు .లోక క్షేమం కోరి శంకరులు ఆ లింగాలలో ముక్తిలింగాన్ని కేదార్నాథ్ ఆలయంలో , వరలింగాన్ని నేటి నేపాల్లో ఉన్న నీలకంఠ క్షేత్రం లో , భోగలింగాన్ని కర్ణాటక లోని శారదా పీఠంలో,మోక్ష లింగాన్ని తమిళనాడులోని చిదంబరం లో ఐదవ లింగమైన **యోగలింగాన్ని** తన స్థానమైన **కంచిలో** స్థాపిస్తారు . ఈ లింగాలు శంకరుల కాలం నుండీ పారంపర్యంగా ఎప్పటికీ పూజలు అందుకుంటూనే ఉంటాయి .

ప్రసిద్ధమైన అద్వైత వేదాంత విద్యా మఠాలను శ్రీ శంకరులు ఏర్పాటు చేసారు . అవి శారదాపీఠం ,కంచికామకోటి పీఠం( సర్వజ్ఞపీఠం) ,బదరీనాథ్ ( హిమాలయ ప్రాంతం లో ), జగన్నాథ ( పూరి లో ),ద్వారకా పీఠం ( గుజరాత్ లో ).

వివిధ గ్రంథాలలో శంకరులు పైవేకాక ఇంకాఎన్నో మఠాలను ఏర్పరిచారని చరిత్రకారులు చెపుతున్నారు.

శంకరులు దేశంలోని చాలాప్రాంతాలలో పర్యటించారు. అందులో ముఖ్యంగా చెప్పవలసినవి- కాశి, ప్రయాగ, బద్రీనాథ్, కాశ్మీర్, చిదంబరం, జంబుకేశ్వరం, శ్రీరంగం, రామేశ్వరం,తిరుపతి ,ద్వారక ,పూరీ మొదలైనవి .

కంచిలో శ్రీ శంకరులు కామాక్షి అమ్మవారిమూర్తి ఎదురుగ శ్రీచక్ర స్థాపన చేసారు . ఆ శ్రీచక్రం ఇప్పటికీ , ఎప్పటికీ పూజలు అందుకుంటూనే ఉంటుంది.

చివరి కాలంలో వారు కంచిలోనే తన 32వఏట శివైక్యంపొందారు. సురేస్వరాచార్యులు, పద్మపాదులు( సనందులు ), తోటకాచార్యులు , హస్తామలకులు శ్రీ

శంకరుల శిష్యులలో ముఖ్యులు. శంకరులు కంచి పీఠాన్ని ,ఈ నలుగురు మిగిలిన నాలుగు పీఠాలను అధిష్టించారు. ఈ మఠాల ద్వారా శంకరుల జ్ఞానదీప్తి ప్రపంచానికి ఎప్పటికీ ప్రసరిస్తూనే ఉంటుంది.

శంకరుల తరువాత కంచి పీఠాన్ని అధిష్టించిన 68 వ ఆచార్యులు – "నడిచేదేవుడు" గాప్రఖ్యాతి గాంచిన శ్రీ చంద్రశేఖర సరస్వతీస్వామి . వీరినే పరమాచార్యులని ,మహాస్వామి అని, పెరియవ అని కూడా సంబోధిస్తారు .

## పరమాచార్యులు... శ్రీ చంద్రశేఖర సరస్వతీస్వామి

పరిపూర్ణ దైవీసంపద, అత్యంత కఠోర నియమపాలన, తీవ్రాతి తీవ్రమైన తపస్సు,అచంచలమైన శ్రద్ధ ,అపారశాస్త్ర పాండిత్యము,అనన్యమైన దైవీ ధర్మ కార్యనిర్వహణ వారిని ప్రపంచం నలుదిశలా మరో శంకరాచార్యులు గా ప్రసిద్ధి పొందేటట్లు చేసాయి.

పరమాచార్యులవారు తమిళనాడులో, వేలూరు నందు స్మార్తహొయసల కర్నాటక బ్రహ్మణ కుటుంబంలో1894 మే20న అనూరాధనక్షత్రంలో జన్మించారు .స్వామి తల్లిదండ్రులు మహాలక్ష్మి, సుబ్రహ్మణ్య శాస్త్రి. జిల్లా విద్యాధికారిగా పనిచేసిన సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి స్వామివారు రెండవ కుమారుడు చంద్రశేఖరేంద్ర సరస్వతి. స్వామికి జన్మించినప్పుడు పెట్టిన పేరు స్వామినాథన్. స్వామినాథన్ దిండివనంలో తన తండ్రి పనిచేస్తున్న ఆర్కాట్ అమెరికన్ మిషన్ ఉన్నత పాఠశాలలో విద్యాభ్యాసం చేసి చురుకైన విద్యార్థిగా పేరు తెచ్చుకున్నారు . స్వామికి 1905 సం. లో ఉపనయనం జరిగింది.

13వఏటనే సన్యాసదీక్ష పుచ్చుకొని కంచికామకోటిపీఠం అధిష్టించారు. చంద్రశేఖరేంద్రస్వామివారు కేవలం పీఠాధిపతే కారు .వారి లో ఒక వేదరక్షకుడు , ఒక శాస్త్రపరిశోధకుడు,రాజకీయవేత్త,చారిత్రకపరిశోధకుడు,జ్యోతిశ్శాస్త్రవేత్త,బహుభాషాపండితుడు ( ఇంగ్లీషు , ఫ్రెంచి , హిందీ , తమిళం, కన్నడ, బెంగాలీ, తెలుగు లతో పాటు 17 భాషలు లో నిష్ణాతులు) ఉన్నారు. ఇన్ని విషయాల్లో విస్తృతమైన ప్రతిభా సామర్థ్యాలు కలిగిన చంద్రశేఖరేంద్రసరస్వతిస్వామివారి జీవితంఅద్భుతం,మహిమాన్వితం.

నిండునూరేళ్ళు (1994 జనవరి 8 వరకు ) విలక్షణమైన జీవితాన్నిగడిపి, పాదచారియై దేశమంతాసంచరిస్తూ ధర్మప్రభోదాలుచేసి ,దైవశక్తిని నిరూపిస్తూ,సనాతనధర్మపునరుద్ధరణకై జీవితాన్ని అంకితం చేసుకున్న మహాపురుషులు శ్రీస్వామివారు .

స్వామివారి శారీరకశ్రమ ఊహకేఅందనిది .1919లో మొదలుపెట్టిన పాదయాత్ర 21 సం.ల పాటు సాగింది .కొన్ని లక్షలమందిని అనుగ్రహిస్తూ ఆధ్యాత్మిక జాగృతి కలిగిస్తూ చేసిన ఈ యాత్ర లో 1927 లో పాల్ఘాట్ వద్ద మహాత్మాగాంధీ తో కొన్ని గంటలపాటు చర్చలు జరిపారు .

గాంధి గారు భోజనం చేయటం మరిచిపోతే రాజాజీగారు (C.రాజగోపాలాచారి) రాత్రి భోజనానికి గుర్తుచేస్తే గాంధీగారు మహాస్వామిని ఉద్దేశించి 'ఈ మహానుభావునితో మాట్లాడుతుంటే నాకు కడుపు నిండిపోయింది. ఇంకనాకు భోజనం అవసరం లేదు' అన్నారు .

"కౌపీన వంతః ఖలుభాగ్యవంతః" అన్న శంకరుల వాక్యాలకు ప్రమాణంగా జీవించారు శ్రీ స్వామివారు .కోట్ల విలువచేసే మఠం ఆస్తులు ,లక్షలాది భక్తులు ఉన్నా, పట్టు పరుపులతో ఊరేగేసౌకర్యంఉన్నా స్వామివారు వాడేది చెక్క పాత్రలు,పడుకునేది అంగవస్త్రం పరచిన కటికనేల .భయంకరమైన ఎండలలో పర్యటించే టప్పుడు కూడా స్వామివారు కాళ్ళు చాపుకోటానికి కూడా వీలులేని , గాలికూడారాని ఇరుకు మేనాలోనే విశ్రమించేవారు. సౌచామనములకు తప్పించి నీరు కూడా తీసుకునేవారు కాదు. సంవత్సరంలో సగం రోజులుఉపవాసం,చాలారోజులు కాష్ఠమౌనం, ఏకాదశి ఉపవాసం, సాయంత్రం త్రయోదశి ఘడియలువస్తేఉపవాసం,నవరాత్రులులోఉపవాసం.14ఏళ్లకేఉప్పు,చింతపండు,మిరపకా యలువదిలేసారు.కొన్నాళ్ళుకేవలంపచ్చిఆవుపాలు,మరికొన్నాళ్ళు కేవలం మూడు పిడికిళ్ళు అన్నం, ఇంకొన్నాళ్ళు కేవలం పెరుగులో నానబెట్టిన పేలాలు .. ఇలా అత్యంత కఠోర నియమపాలన తో జీవించారు .

ఒకసారి ఒక ట్రస్ట్ లోని డబ్బులు పొరపాటున వేరొక ట్రస్ట్ లోని కార్యక్రమాలకు వాడటం జరిగింది . అది ట్రస్ట్ నియమాలకు విరుద్ధమని తరువాత తెలిసింది . ఆడబ్బు తిరిగి మొదటి ట్రస్ట్ లో జమకట్టే ఏర్పాటు చేసినంతవరకూ ఉపవాసం చేసారు స్వామివారు .

పరమాచార్యుల వారికి నాలుగుసార్లు 1954,1957,1965 మరియు 1993 లలో కనకాభిషేకం జరిగింది .వారిని సన్మానించిన వారిలో, భక్తులలో ,సర్వజాతుల వారు, ఇతర మతాలవారు, విదేశాలవారు ,సామాన్య మానవుల నుంచి ప్రధానమంత్రి, రాష్ట్రపతి ల వరకుఉన్నారు . అందరి గౌరవ వందనాలను పొంది వారిని అనుగ్రహించారు .

" స్వామి వారిని ఎందుకు అర్చించవలె? – సమస్త సాధకములందు ఉత్క్రుష్టతనొందిన మన కంచి యోగీంద్రులను అర్చించినట్లయితే మనము కోరుకున్న సిద్ధి లభిస్తుంది . బ్రహ్మ నుంచి చీమ వరకు ఉన్న సమస్త ఉపాధుల్లోను వ్యాపించి ఉన్న బ్రహ్మపదార్ధమును చూడగలిగిన ప్రజ్ఞ వారికి ఉంటుంది" అంటారు బ్రహ్మశ్రీ కుప్పా లక్ష్మావధాన్లు గారు .

పరమచార్యులవారు తామెవరో తెలియపరిచిన ఒక సందర్భం : తమిళనాడులో పొల్లాచ్చి నుంచి వచ్చిన మహిళ వ్రతం కట్టుకునే తోరణాన్ని వారికిచ్చింది . మహాస్వామి దానిని తలపై ధరించారు .అది కిందికి జారి కన్నుకి అడ్డంగా ఉందని ఒక శిష్యుడు అడ్డు తీయబోయాడు . వెంటనే స్వామివారు "దాన్నెందుకు తీస్తావు ? అది నోములకు కట్టుకునే తోరణం. ఆ అమ్మగారిచ్చింది .స్త్రీలందరూ తోరణాలను అమ్మవారికి అలంకరించడం ఆనవాయితీ .కానీ **ఈమెదృష్టిలో నేనే అమ్మవారు.అందుకేఆమెదానిని నాకు సమర్పించింది**" అన్నారు .

వేరొక సందర్భంలో ఒక చిత్రపటం చూసారు. అందులో మూడుచిత్రాలు- ముందుగా దక్షిణామూర్తి ,తరువాత ఆది శంకరులు , ఆ చిత్రాలకు క్రింద పరమాచార్యులది ఉన్నవి .దాన్ని చూపిస్తూ ఈ చిత్రం లో ముగ్గురు చిత్రాలను మాత్రంఎందుకు చిత్రించారు? అని ప్రశ్నించి , జవాబు కూడా ఆయనే ఇచ్చారు " **ఈయనే ఆయన, ఆయనే ఈయన**" అని వేలుపెట్టి చూపుతూ "అందువలననే ఇలా చిత్రించారు" అని తన అవతారాన్ని స్పష్టంగా తెలియపరిచారు.

గంగా మహాసముద్రమయిన వారి లీలలలో గుక్కెడు పవిత్రమైన జల(లీలలు)ను కొంచెమైనా తాగితే అనంతమైన వారి కృపకు పాత్రుల మవుతాము కదా !!!!!

*** *** *** *** *** ***

# పరమాచార్యుల లీలావిషయముల పట్టిక

# 1. కామాక్షి కాపాడిందా?

ఈ సంఘటన జరిగినప్పుడు మహాస్వామి వారి భక్తురాలు తన భర్తతో కలిసి కలకత్తాలో నివసించేది. ఆవిడ భర్త కార్యాలయానికి వెళ్ళగానే తలుపు చప్పుడు అవ్వటంతో తలుపు తీసింది. వెంటనే ఓ నలుగురు నక్సలైట్లు లోపలికి దూసుకుని వచ్చారు. వారు మాట్లాడుకుంటున్న మాటలను బట్టి వారు తనను చంపడానికి వచ్చారని అర్థమైంది.

వారి ఆజ్ఞ మేరకు వాళ్ళకు టీ పెట్టడానికి వెళ్ళింది. తరువాత వారిని బ్రతిమాలి చెన్నైలో చదువుకుంటున్న తన పిల్లలకు ఫోనుచేసి మాట్లాడింది. మరునాడు తన గురించి ఏదైనా చెడు వార్త వినాల్సివస్తే వివేకముగా ప్రవర్తించమని, బాధపడకూడదని తెలిపింది.

తరువాత హాలులోకి వచ్చి పక్కపక్కనే ఉన్న పరమాచార్య స్వామి, కాళి చిత్రపటం ముందు మోకరిల్లింది. ఈరోజు ఏకాదశి ఈరోజు ఇంతటి పరిస్థితిని ఎదుర్కోవలసి వచ్చింది అని బాధపడుతూ, ఆ నక్సలైట్ల వంక తిరిగి "దయచేసి ఒక్కసారిగా నన్ను చంపేయండి. నన్ను ఏమి చేయవద్దు" అని వేడుకుంది.

అప్పుడే అద్భుతం జరిగింది. నక్సలైట్లు ఆమె ముందున్న పరమాచార్య స్వామి వారి పటంవైపు లీలగా చూసారు. కాని వారికి అందులో పరమాచార్య స్వామి వారికి బదులు ఉగ్రరూపంతో కాళీకా దేవి కనపడసాగింది.

వారు దుర్గా దేవి భక్తులు. ఇంతకుముందు ఆ గోడకి ఒక్కటే కాళి దేవి పటం ఉన్నది. కాని ఇప్పుడు వారికి రెండు కనిపిస్తున్నాయి. అమ్మవారి భక్తులైనందువల్ల వారు చంపదలచిన ఆ గృహిణిలో కాళికాదేవిని చూసారు."**అమ్మా మమ్మల్ని క్షమించు**" అని చెప్పి అక్కడి నుండి తప్పించుకొని పోయారు. ఆవిడ భర్త ఇంటికి రాగానే కళ్ళవెంబడి నీరు కారుస్తూ, జరిగిన విషయమంతా చెప్పింది. వెంటనే వారు కంచికి బయలుదేరారు.

ఎప్పటిలానే కంచి మఠంలో భక్తుల తాకిడి ఎక్కువగా ఉంది. వారు వరుసలో నిలబడి వారి వంతు రాగానే కన్నీళ్ళతో సాష్టాంగం చేసి స్వామిని దర్శించుకున్నారు. అప్పుడు **స్వామివారు నవ్వుతూ,"అయితే కామాక్షియే కాపాడింది**" అని పలికి తమకు జరిగినదంతా తెలుసు అన్నట్టు చూసారు. నిజమైన గురుభక్తి ఎప్పుడూ గెలుస్తుంది.

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం!

శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం !!

# 2. రక్షణ-రామాయణం-రాముడు

## *రాముడు సీతనెందుకు వదిలేసాడు?*

బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు** బయటకువస్తే గృహస్థాశ్రమ ధర్మపు ఆచారం పాడైపోతుందని బాధ పడేవారు. అప్పుడు పరమాచార్యస్వామివారు బ్రహ్మరథం(వేదం చదువుకున్నవారు మోసే పల్లకి) ఎక్కి శాస్త్రిగారి ఇంటికివచ్చారు. వారింట్లోదిగి పరమాచార్య స్వామివారు శాస్త్రిగారితో, "ఏమి నీఆచారానికి ఇబ్బందివస్తోందని బెంగ పెట్టుకుంటున్నావా? **ఇవ్వాళ మీఆచారానికి మేముకొత్తగా రక్ష కడుతున్నాం. ఇక నీకు ఇబ్బంది కలగదని" శాలువా తీసి కప్పారు.**

పరమాచార్య స్వామి వారు శాలువా కప్పడము అంటే అంగరక్ష కట్టినట్టే. "ఇంక నీకు బెంగ లేదు. ఇప్పుడు బయటకు వచ్చినా ఏమి ఇబ్బంది కలగదు" అని అన్నారు. ఆ గురు శిష్యుల సంబధం అటువంటిది.

పరమాచార్య స్వామి వారు కూర్చొని ఉండగా శాస్త్రిగారు వారి తండ్రిగారైన కీర్తి శేషులు **తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రులు గారు** 'రామకథామృతము' అనే గ్రంథం రచించారు. దాన్ని స్వామి వారి ముందు చదువుదామని శాస్త్రి గారు వెళ్ళారు. పరమాచార్య స్వామి వారు లోపలికి రమ్మన్నారు. శాస్త్రిగారు ఆ పుస్తకాన్ని చదువుతున్నారు.

పరమాచార్య స్వామి వారు "పద్యాలు చాలా బాఉన్నాయి. చదువు చదువు" అని అంటున్నారు. ఇంతలో స్వామి వారి సేవకులొకరు వచ్చి "పెరియవ! బెంగళూరు నుండి ఒకరు వచ్చారు. పీఠానికి ఇవ్వాలని చాలా డబ్బు తెచ్చారు. మీ దర్శనం చేసుకుని డబ్బు ఇచ్చి వెడతాము అని అంటున్నారు" అని చెప్పాడు. స్వామి వారు అతనితో కాసేపాగమను అని నువ్వు చదువు అని శాస్త్రిగారిని అన్నారు.

సేవకుడు మరలా వచ్చి "వారికి ఏదోపని ఉన్నది కావున తొందరగా మీ దర్శనం చేసుకొని వెళ్ళాలట" అని చెప్పాడు. కాని స్వామి వారు ఏమి మాట్లాడక శాస్త్రి గారి వైపు తిరిగి చదువు అని అన్నారు. సేవకులు మరలా వచ్చి అదే విషయం చెప్పారు. "ఆ బెంగళూరు ఆయనకు ఏదో పని ఉన్నదట. మీరు ఒక్కసారి దర్శనం ఇస్తే చూసి డబ్బిచ్చి వెళ్ళిపోతాడట. వారిని పంపమంటారా?".

ఈ విషయాన్నంతా చూసి, శాస్త్రి గారు "అరే ఏమిటిది నేను ఇలా కూర్చుని పద్యాలు చదువుతూ ఉండడం వల్ల స్వామి వారికి ఇబ్బంది కలుగుతున్నట్టు ఉంది" అని లోలోపల బాధపడుతున్నారు.

*అప్పుడు పరమాచార్య స్వామి వారు ఆ సేవకులతో, "అతను డబ్బు తెచ్చాడని అతనితో ముందు మాట్లాడాలా?* లేక రామాయణం కన్నా అతను వచ్చి మాట్లాడడం గొప్ప అని అనుకుంటున్నాడా? నన్ను దర్శనం చెయ్యాలనుకుంటే తరువాత రమ్మను లేదా వేచి ఉండమను. నాకు ఈ రామాయణమే గొప్పది" అని అన్నారు.*

శాస్త్రి గారి తండ్రి గారు వ్రాసిన ఆ రామాయణం ఎందుకు గొప్పదో లోకానికి తెలియజెప్పాలని అనుకున్నారు స్వామి వారు. శాస్త్రిగారిని ఇలా అడిగారు.

*"ఏమయ్యా! రాముడు సీతమ్మ తల్లితో అగ్నిప్రవేశం చెయ్యించాడు కదా. సీత అగ్నిపునీత అని తెలుసు కదా! ఇంత తెలిసిన తరువాత కూడా ఎవరో ఎక్కడో ఒక పౌరుడు ఏదో నింద చేసాడని సీతని పరిత్యజించడం న్యాయమా?* సరే *రాజారాముడు చిన్న అవమానం వచ్చినా ఆ రాజపదవిలో కూర్చోవడానికి ఇష్టపడడు అందుకే పరిత్యజించాడు* అని వాల్మీకి చెప్పాడు. ఎందరో కవులు కూడా అదే చెప్పారు. నేను ఎనభై రామాయణాలు (వాల్మీకి రామాయణం , కంబ రామాయణం, భాస్కర రామాయణం, హనుమద్ రామాయణం, ఆధ్యాత్మ రామాయణం, మొల్ల రామాయణం మొ|| చదివాను. ఒక్కొక్క కవి ఒక్కొక్కరకంగా చెప్పారు. మరి మీ నాన్న గారు ఈ విషయాన్ని ఎలా సమర్థించారు?" అని అడిగారు.

శాస్త్రిగారు ఆ ఘట్టం తీసి, ఇలా వివరణ ఇచ్చారు "రాముడు సీతమ్మ తల్లిని రాజు కాకముందు పెళ్ళి చేసుకున్నాడు. అప్పుడు రాముడు రాజకుమారుడు అంతే. యుద్ధం తరువాత సీత అగ్నిపునీత అని లోకానికి చాటి పట్టాభిషేకం చేసుకున్నాడు. ఒకనాడు మంత్రులలో ప్రభువుకు నీతి పాఠం చెప్పే మంత్రి వచ్చి రాముడు ఏకాంతలో ఉండగా,

"ప్రభూ! మీరు వైకుంఠంలో ఉన్న శ్రీమన్నారాయణుడు. లోకానికి ధర్మం నేర్పడానికి రామచంద్రమూర్తిగా వచ్చి నరుడిగా ఈ భూమిపై నడుస్తున్నారు. ఇటువంటి మీరు ప్రభువు కాకముందు సీతమ్మను భార్యగాఉంచుకున్నారు. ధర్మానికి తప్పులేదు. కాని ప్రభువయ్యాక సీతమ్మ భార్యగా ఉండవచ్చా?" అని అడిగారు.

"ఎందుకుండకూడదు?" అని అడిగారు రాములవారు. అందుకు మంత్రి, *"ప్రభువు భూమిపతి. అంటే ఈ భూమికి భర్త. మరి అప్పుడు భూమాత తనయ సీతమ్మ మీకు*

*ఏమవుతుంది? మీరు రాజారాముడయ్యాక మీరు ఏకపత్నీవ్రతుడు కాబట్టి భూమికి మాత్రమే భర్తగా ఉండాలి. మరి ఇప్పుడు ధర్మం నిలిచిందా?" అని అడిగాడు. ఉలిక్కిపడిన రాముడు కారణం చెప్తూ ధర్మం కోసమే సీతమ్మను అడవికి పంపించాడు రాముడు"* అని చెప్పారండి మా నాన్న గారు అని అన్నారు.

ఈ మాటలు విని పరమాచార్య స్వామి వారు పరవశించిపోయారు. ఇన్ని రామాయణాలు విన్నాను గాని ఇలా సమర్ధించిన వాణి వినలేదు అని "ఆ పుస్తకాల సెట్టు ఒకటి అక్కడ పెట్టిపో" అన్నారు. "తమకు నాగరలిపి వచ్చు. అరవలిపి వచ్చు. మరి తెలుగులిపి పరిచయమేనా?" అని శాస్త్రి గారు అడిగారు. "నాకు అక్షరాలు వస్తేనేమి, రాకపోతేనేమి? పుస్తకాలు పెట్టి పూజ చేస్తాను. ఒక సెట్టు ఇవ్వు" అన్నారు. తరువాత కొంత కాలానికి శాస్త్రి గారు పరమాచార్యస్వామి వారి దర్శనానికి వెళ్ళారు. స్వామి వారు ఒకగంటసేపు పురాణం చేసారు. తరువాత స్వామి వారు ఈ కింది పద్యం చదివారు.

**కనుమీ నీ నగుమోము మేల్సిరికి లక్ష్యం బౌటకున్ ల**
**జ్జనెట్టగ ముస్మున్న మునింగి కొండచరిబాటం జారె రేరేడటం !**
**చనుమోదించుట బద్మినీపతి నిజుస్య స్మేర దృష్టి ప్రసా**
**ర నవోల్లాసిత హ్రీణయై తెలిపెడిన్, రామా! జగన్మోహనా!!**

ఇది శాస్త్రిగారి తండ్రిగారు వ్రాసిన '**రామకథామృతము**'లో బాలకాండ, నవమాశ్వాసము లోనిది. విశ్వామిత్రుడు శ్రీరాముని నిద్రలేపు సందర్భం. మహాస్వామి వారు పైపద్యం చదివి, "మీ నాన్నగారు దారినపోతూ ఎప్పుడూ ఈ పద్యం చదువుతూ ఉండేవారు కదా?" అని శాస్త్రి గారిని అడిగారు. ఏనాడో గతించిన వారి నాన్నగారు ఆ పద్యాన్ని ఎంత ఆర్తిగా చదివే వారో అలాగే స్వామి వారు ఎట్లా చదవగలిగారు!

--- బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావు శర్మ గారి ప్రవచనం నుండి

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం!
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం !!

** శ్రీ తాడేపల్లి రాఘవ నారాయణ శాస్త్రిగారు మహాత్ములు . వారి శరీరం విడిచాక దహనం చేసేటప్పుడు వారు నిరంతరం ఉపాసించిన బాల త్రిపుర సుందరి అమ్మవారు ఉజ్వలంగా ప్రకాశిస్తూ కనిపించారు .ఆవిషయం ప్రముఖ పత్రికలలో ప్రచురించారు కూడా !!

*ఎవరైనా మహాత్ములకు, వారి సంస్థలకు మనం డబ్బు ఇచ్చేటప్పుడు అత్యంత వినయంతో ఇవ్వాలి . ఆకారణంగా మనకు ప్రాముఖ్యం ఇవ్వాలని మనసులో కూడా కోరకూడదు. ఇంకా, మన నుంచి స్వీకరిస్తున్నందుకు కృతజ్ఞత తో ఉండాలి . అది నిజంగా మన భాగ్యం.

# 3. సర్వేశ్వరునకు మనం చెప్పాలా?

శంకరనారాయణన్ పరమాచార్య స్వామి వారి గొప్ప భక్తుడు. అతను ఎప్పుడూ మహాస్వామి వారి దర్శనానికి వచ్చేవాడు. అనుకోకుండా అతను ఒక వింత వ్యాధి బారిన పడ్డాడు. పది పదిహేను రోజులకు ఒకసారి విపరీతమైన జ్వరం వచ్చేది. ఇలా పదే పదే రావడం వల్ల ఎందరో వైద్యుల సలహా మేరకు ఎన్నో రకాల మందులు వాడాడు. కాని, వేటి వల్లా ఉపయోగం లేదు. ఆ వ్యాధి ఎంతకూ తగ్గడం లేదు. చివరికి ఆయన ఇది మందుల వల్ల డాక్టర్ల వల్ల తగ్గే జబ్బు కాదు కేవలం పరమాచార్య స్వామి వారి అనుగ్రహంతోనే ఇది నయమవుతుంది అని మహాస్వామి వారి దర్శనానికి శ్రీమఠానికి వచ్చాడు.

మహాస్వామి వారిని దర్శించుకుని తన వ్యాధి గురించి చెప్పబోతుండగా, స్వామి వారు ఇతని మాటలకు అడ్డు పడుతూ,"ఇదేనా రావడం?"అనిఅడిగారు.

"అవును పెరియవా!"

కంచిలో ఉన్న జ్వరహరేశ్వరుని దేవాలయం గురించి విన్నావా? ఎప్పుడైనా అక్కడికి వెళ్ళావా?" అని అడిగారు మహాస్వామి వారు. "లేదు పెరియవ! తెలియదు" అని అన్నాడు.

"సరే! ఈరోజు కార్తీక మాసం, ఆదివారం. పద మనం ఈరోజు జ్వరహరేశ్వరుని-సూర్య భగవానుని దర్శించుకుందాము" అని ముందుకు నడిచారు. శంకరనారాయణన్ మారు మాట్లాడకుండా ఆవును అనుగమించే దూడ లాగా స్వామి వారి వెంట వెళ్ళారు. వారు అక్కడికి చేరుకునేటప్పటికి దేవాలయం మూసివేసి పూజారి కూడా వెళ్ళిపోయాడు. అయినా స్వామివారు శంకరనారాయణన్ తో జ్వరహరేశ్వరుని దర్శింపజేసి, ఇలా అడిగారు, "నీ వద్ద కొంత డబ్బు ఉన్నదా?" "లేదు పెరియవ. నా పర్సును మఠంలోనే ఉంచాను. ఇక్కడికి ఏమి తీసుకుని రాలేదు" అని అన్నాడు.

"సరే ఒక పని చెయ్యి. అక్కడున్న మండపానికి వెళ్ళి, అక్కుడన్న వారితో అడిగి కొద్ది పైకము తీసుకుని రా" అని ఆజ్ఞాపించారు. శంకరనారాయణన్ అక్కడికి వెళ్ళి కొద్దిసేపట్లో ఒక పది పదిహేను రూపాయలను తేగలిగాడు. మహాస్వామి వారు అతన్ని చూసి, "స్వామి సన్నిధి ముందు ఒక పళ్ళెం ఉంది కదా అందులో కొంత వెయ్యి. మిగిలినది అక్కడున్న హుండిలో వెయ్యి" అని చెప్పారు. అతను స్వామి వారు చెప్పినట్టు

చేసాడు."మంచిది. సరే పద ఇప్పుడు ఇక్కడినుండి కచ్చపేశ్వర దేవాలయానికి వెళ్దాము. ఈరోజు కార్తీక ఆదివారం కనుక అక్కడ విశేష పూజలు జరుగుతుంటాయి"

*"నీకు తెలుసా! 'ఆరోగ్యం భాస్కరాధిచ్ఛేత్'. ఆరోగ్యము సూర్యుని అనుగ్రహం వల్లననే సిద్ధిస్తుంది"*

అని తెలిపి అక్కడికి దారితీసారు. మహాస్వామి వారు అక్కడ దర్శనం చేసుకొని, అక్కడున్న సూర్యభగవానుని ఆరాధించి అక్కడున్న మండపంలోనికి వచ్చారు. అక్కడున్న కొంతమంది వేదపండితులని పిలిచి **సూర్య శతకం** చెప్పమన్నారు. తరువాత దాని గురించి మహాస్వామి వారు చెప్పారు.

తరువాత శంకరనారాయణన్ తో, "సరే సమయం అయిపోయింది. నివ్వు ఇక వెళ్ళి మఠంలో భోజనం చేసి నీ చోటికి బయలుదేరు" అని అన్నారు.

పరమాచార్య స్వామి వారితో కలిసి ఇలా దేవాలయ దర్శనం చెయ్యడం శంకరనారాయణన్ కు ఆనందంగా ఉన్నా, తన ఆరోగ్య పరిస్థితి గురించి స్వామి వారికి చెప్పే అవకాశం దొరకనందుకు చాలాబాధపడ్డాడు.దిగులుతో అక్కడినుండి వెళ్ళిపోయాడు.

*కాని కొన్ని రోజుల తరువాత అతనికి తెలిసి వచ్చింది తనకు ఆ వ్యాధి పోయిందని మరలా ఎప్పుడు జ్వరం రాలేదని.*

***ఆ సర్వేశ్వరునకు మనం చెప్పాలా?***

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం!
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం !!

# 4. అతిథిసేవ:

చాలా సంవత్సరాల క్రితం మహాస్వామి వారు కలవైలో మకాం చేస్తున్నారు. ఆ రోజు ఆదివారం కావడంతో చలా మంది స్వామి వారి దర్శనం కోసం వచ్చారు. ఒకరి తరువాత ఒకరు ఆ వచ్చిన వారు స్వామివారికి సాష్టాంగపడి నమస్కరించి వారి ఆశీస్సులు అందుకుని ముందుకు వెళ్ళిపోతున్నారు. మధ్యవయస్కులైన ఒక జంట స్వామివారికి నమస్కరించి చేతులు కట్టుకుని నిలబడ్డారు. స్వామివారు వారిని తేరిపార చూసి, "అరెరె ఎవరు? పాలూరు గోపాలన్! సంవత్సరం క్రితం వచ్చావు ఏవో సమస్యలు ఉన్నాయని. ఇప్పుడు హాయిగా ఉన్నవా?" అని గట్టిగా నవ్వారు.

***ముకుళిత హస్తాలతో పాలూర్ గోపాలన్ "మేము చాలా బాగా ఉన్నాము పెరియవా! మీరు చెప్పినట్టుగానే, మధ్యాహ్నం పూట రోజూ ఒక అతిథికి అన్నంపెట్టడం మొదలు పెట్టినప్పటి నుండి అంతామంచే జరుగుతోంది.నాపొలంలో పంటలు బాగాపండుతున్నాయి. మునుపటిలాగా ఆవులు చనిపోవడంలేదు. అనవసరంగా ఖర్చు అవుతున్న ధనం ఇప్పుడు చేతిలో నిలబడుతున్నది.అంతా మీఅనుగ్రహం వల్ల మీరు ఆజ్ఞాపించినట్టుగా చేస్తున్న అతిథిసేవ వల్లనే. అంతే మరేం లేదు. ఒక్కరోజు కూడా తప్పకుండా చేస్తున్నాను" అనిఅంటుండగా కళ్ళనీరు పెట్టుకున్నాడు. పక్కనే నిలబడ్డ ఆయన భార్య కూడా ఆనందంతో కళ్ళనీరు కార్చింది.***

అంతా విని స్వామి వారు "భేష్!భేష్! అతిథిసేవ వల్లే ఇంత మంచి జరుగుతోందని నువ్వు అర్థం చేసుకున్నావు కదా మంచిదే. అదిసరే ఈరోజు ఇద్దరూ ఇక్కడికి వచ్చారు కదా. మరి అక్కడ పాలూరులో అతిథిసేవ ఎవరు చేస్తారు?" అని ఆందోళనగా అడిగారు.

గోపాలన్ భార్య వెంటనే "మేము అందుకోసం వేరే ఏర్పాట్లు చేసాము పెరియవా. ఎట్టి పరిస్థితిలోను అతిథి సేవ చెయ్యకుండా ఉండము" అని చెప్పింది.

ఆ విషయం విని మహాస్వామి వారు చాలా సంతోషించారు. ***"అవును చెయ్యవలసిన పద్ధతి ఇదే. ఆకలిగొన్న వారిని ఆదరించాలన్న సంకల్పం స్థిరంగా ఉండాలి. అతిథిసేవ ఎంతటి అనుగ్రహాన్ని ఇస్తుంది అంటే అది నీ వంశాన్ని కాపాడుతుంది. ఒకరోజు సాక్షాత్ పరమేశ్వరుడే అతిథి రూపంలో నీ ఇంటికి వచ్చి కూర్చుని తిని వెళ్తాడు. తెలుసా?" అని అన్నారు.***

స్వామివారు కుతూహులంతో మాట్లాడుతున్నారు. స్వామివారు మాట్లాడుతున్న ఈఅనుగ్రహ వాక్కులను వినడానికి వరుసగా నిలబడ్డవారంతా స్వామి చుట్టూ చేరారు. స్వామివారు అందరినీ నేలపైన కూర్చోమన్నారు అందరూ కూర్చున్నారు.

ఒక భక్తుడు స్వామివారిని "అతిథి సేవ చెయ్యడంలో అంత గొప్పదనం ఉందా స్వామి?" అని అడిగాడు. వెంటనే స్వామివారు బదులిస్తూ, "అవును అవును అది అత్యంత పుణ్యప్రదం. ఈ పుణ్యకార్యం వల్ల మోక్షం కూడా లభిస్తుంది. ఈ సత్కార్యం ఎంతో మందిని ఉద్ధరింపజేసింది. మీరు కేవలం అటువంటి అనుభవాన్ని పొందిన పాలూర్ గోపాలన్ వంటి వారిని అడిగినప్పుడు మాత్రమే దాని ప్రాముఖ్యత మీకు తెలుస్తుంది" అని అన్నారు.

ఒక భక్తుడు లేచి నిలబడి స్వామివారికి సాష్టాంగం చేసి, వినయంగా ఇలా అడిగాడు. "నా పేరు రామసేతు. నేను తిరువణ్ణమలై నుండి వచ్చాను. మేమందరమూ స్వామి వారిని ప్రార్థిస్తున్నాము. మాకు అర్థమయ్యేట్టుగా ఈ అతిథి సేవ గురించి సవివరంగా తెలపలసిందిగా అర్థిస్తున్నాము. స్వామి వారు మా మీద కరుణ చూపాలి"

స్వామివారు అతణ్ణి కూర్చోమన్నారు. అతను కూర్చున్నాడు. అక్కడున్న అందరూ నిశ్శబ్ధంగా స్వామి వారిని చూస్తున్నారు. కొద్దిసేపటి తరువాత ఆ పరబ్రహ్మం మాట్లాడింది.

"నాకు గుర్తున్నంత వరకు అది 1938 లేదా 1939 సంవత్సరం. శంకర మఠం వ్యవహారాలన్నీ కుంభకోణం నుండి జరిగేవి. అప్పుడు జరిగిన ఒక సంఘటన గురించి ఇప్పుడు మీకు చెబుతాను. మీరు భక్తిగా వింటే ఈ సంఘటనలో ఉన్న ఆంతర్యం మీకు అర్థం అవుతుంది. ఇప్పుడు చెప్తాను వినండి".

స్వామివారు కొద్దిసేపు ఉండి మరలా చెప్పనారంభించారు. "కుంభకోణం మహామాహం కొలనుకి పడమరవైపు ఒక పెద్ద ఇల్లు ఉంది. ఒక కిరాణా కొట్టు వ్యాపారి **కుమరేసన్ చెట్టియార్** నివసించేవాడు ఆ ఇంట్లో. నాకు బాగా గుర్తు - ఆయన ధర్మపత్ని పేరు **శివకామిఆచి**. వారు కరైకుడి సమీపంలోని పల్లత్తూర్ నుండి వచ్చారు. ఆ దంపతులకు సంతానం లేదు. వారి స్వగ్రామం నుండి ఒక మంచి పిల్లవాణ్ణి తెచ్చి కొట్టు చూసుకోవడానికి వారి వద్దనే ఉంచుకున్నారు.

అప్పుడు కుమరేసన్ చెట్టియార్ వయస్సు యాభై లేదా యాభైఐదు. ఆవిడ వయస్సు యాభైలోపే. ఆ పుణ్య దంపతుల నోటి నుండి ఎప్పుడు 'శివ శివా!. . .శివ శివా!' అనే

నామమే వస్తుంటుంది. ఆ నామస్మరణ తప్పవేరే మాటలేదు. చెట్టియార్ గారి ఇంట్లో ఒక ఎద్దులబండి ఉండేది. ఆచిన్నిబండిలో కూర్చోపెట్టుకుని చెట్టియార్ బండిని తోలుకుంటూ స్నానానికి కావేరి నదికి వెళ్ళేవారు. స్నానాదులు ముగించుకొని మా మఠానికి వచ్చి నమస్కరించి ఆశీర్వాదం తీసుకుని వెళ్ళేవారు. వారిది చాలా అన్యోన్యమైన దాంపత్యం. వారి గురించి నేను ఇప్పుడు చెప్పబోయే విషయం వినండి".

పరమాచార్య స్వామి వారు కొద్దిసేపు మౌనంగా ఉండి మరలా మట్లాడడం మొదలుపెట్టారు. "అన్ని సంవత్సరాలుగా వారు చేస్తున్న పని ఏమిటో తెలుసా? అతిథిని సేవించి పూజించడం. ఆశ్చర్యపడకండి. వారు ప్రతిరోజు మధ్యాహ్నం శివభక్తులందరిని వారి ఇంటిలో అన్నం పెట్టి ఆదరించేవారు. ఎంతమంది అతిథులుగా వచ్చినా దిగులు పడకుండా వండి వడ్డించేవారు. ఆ వచ్చినవారిని ఇంటి వసారాలో కూర్చోబెట్టి నీళ్ళతో వారి కాళ్ళు కడిగి, బట్టతో తుడిచి, గంధము కుంకుమ పూసి, లోపలికి తిసుకునివెళ్ళి కూర్చుండచేసేవారు.

వారింట్లో వంటవారు ఉండేవారు కాదు. ఆ అమ్మే ఎంతమంది వచ్చినా భోజనం వండేది. మరొక్క విషయం ఏంటంటే ఆ వచ్చిన వారికి ఏమి ఇష్టమో అడిగి తెలుసుకుని వాటిని తీసుకుని వచ్చి వారికి నచ్చిన పదార్థాలతో భోజనం సిద్ధం చేసేవారు. అంతటి సహృదయులు. నాకు ఈ విషయాలన్నీ ఎలా తెలుసు అనుకుంటున్నారా? అందులో మర్మమేమి లేదు. శ్రీమఠానికి సంబధించిన సుందరం అయ్యర్ అనేవారు ఆ కుమరేసన్ చెట్టియార్ లెక్కలు చూసేవారు. అతనే ఈ విషయాలన్నీ ఖాళీగా ఉన్నప్పుడు నాతో చెప్పేవాడు. అర్థమైందా?

స్వామివారు కొద్దిసేపు ఆపి, అందరిని పరికించి చూసారు. కూర్చున్న చోటినుండి ఒక్కరు ఒక్క అంగుళం కూడా కదలలేదు. అందరూ స్వామివారినే ఉత్సుకతతో చూస్తున్నారు. మరలా స్వామి వారు ఇలా చెప్పారు. "ఒకరోజు చాలా పెద్దగా వర్షం పడుతోంది. అప్పుడు మధ్యాహ్న సమయం. కుమరేసన్ చెట్టియార్ ఇంటి ద్వారం వద్దకు వచ్చి అటు ఇటు చూసాడు.కాని అతిథి ఎక్కడా కనపడలేదు. ఒక గొడుగు తిసుకుని అలా మహామహం కొలను దాకా వెళ్ళాడు అక్కడ ఎవరైనా ఉన్నారేమో అని చూడసాగాడు.

అక్కడ ఒక శివభక్తుడు స్నానం ముగించుకుని ఒళ్ళంతా విభూతి పూసుకుని కూర్చున్నాడు. చెట్టియార్ అతణ్ణి ప్రార్థించి అథితిగా తన ఇంటికి రమ్మని అర్థించాడు. అతను బాగా విధ్వాంసుడిలా కనిపిస్తున్నాడు. తేవారం పాడుకుంటూ చెట్టియార్ ను అనుసరిస్తూ వెళ్ళాడు. అతనికి కాళ్ళు కడిగి లోపలికి తీసుకుని వెళ్ళి కూర్చుండచేసాడు. దంపతులిద్దరూ నేలపై పడి సాష్టాంగం చేసారు. ఆచి ఆ శివభక్తుని దగ్గరకు వెళ్ళి, 'స్వామి వారికి ఏమి ఇష్టమో చెప్తే, అంగడికి వెళ్ళి వాటిని తీసుకుని వచ్చి వంటచేసి పెడతాను' అని అన్నది.

ఆ శివభక్తుడు చాలా ఆకలి మీద ఉన్నాడేమో, లెచి వెళ్ళి పెరటి వైపు చూసాడు. అక్కడ లేత బచ్చలికూర కనపడింది. అతను వెనక్కువచ్చి ఆఅమ్మతో బచ్చలి కూటు మరియు దాని కాడలతో సాంబారు చాలన్నాడు.  చెట్టియార్ ఒక వెదురు బుట్ట తీసుకుని బచ్చలి ఆకు కొయ్యడానికి వెళ్ళాడు. అప్పటికి వర్షం నిలిచిపోయింది. ఆలస్యమవుతుండడంతో ఆకలిగొన్న ఆ శివభక్తుడు సహాయం చేయదలచి తను కూడా ఒకబుట్ట తీసుకుని కూర కోయడానికి వెళ్ళాడు.

శివకామిఆచి పెరటి తలుపు వద్ద నించుని కూర సేకరిస్తున్న ఇద్దరిని చూస్తోంది. కొద్దిసేపటి తరువాత ఇద్దరూ తమ పళ్ళలను అక్కడ పెట్టారు. అప్పుడు ఆ తల్లి ఏమి చేసిందో తెలుసా? రెండు బుట్టలలోను ఉన్న ఆకుకూరని విడిగా కడిగి, రెండు పొయ్యలను వెలిగించి, రెండు కుండలలో వండడం మొదలు పెట్టింది. దీన్ని గమనించిన ఆ శివభక్తుడు ఆశ్చర్యపోయాడు. అతను అయోమయంతో 'ఏమిటిది? రెండింటిలోను ఉన్నది ఒకే ఆకుకూర కదా? మరి ఒకే కుండలో వండకుండా రెండింటిలో వండడం ఎందుకు?' అని మనసులో అనుకున్నాడు.

కొద్దిసేపటి తరువాత ఆచి ఆ రెండూ మంటపై నుండి దించి, ఆ భక్తుడు తెంపిన కూరతో వండినదాన్ని మాత్రమే పూజగదిలోకి తీసుకుని వెళ్ళి, ఈశ్వరునకు నివేదన చేసింది. ఇది చూసిన ఆ భక్తుడు చాలా సంతోషపడ్డాడు. ఏమనుకున్నాడో తెలుసా? 'నేను పెద్ద శివభక్తుణ్ణి, సన్యాసిని. నేను తెంచిన ఆకుకూరతో వండినదాన్ని మాత్రమే ఈశ్వరుడు తింటాడని ఈ తల్లి అర్థం చేసుకుంది. సరే భోజనం చెసిన తరువాత దీని గురించి అడుగుదాం!' అని అనుకున్నాడు.

స్వామి వారు కొద్దిసేపు ఆగి, తమ ఎదురుగా కూర్చున్న భక్తులవైపు చూసారు. అందరూ నోరెళ్ళబెట్టి వింటున్నారు. స్వామివారు మళ్ళా "ఆ శివభక్తుడు భోజనం ముగించి, అతని సందేహాన్ని ఆచితో అడిగాడు. అందుకు ఆచి ఏమి చెప్పిందో తెలుసా? ఆమె అన్నది 'అయ్యా, మీరిద్దరూ పెరటిలో ఆకుకూర కోస్తున్నప్పుడు నేను చూస్తున్నాను, ***నా భర్త ప్రతి ఆకుని 'శివా!. . శివా!. శివా!. . ' అని శివనామం చెప్తూ కోస్తున్నాడు. కబట్టి అది అక్కడే అప్పుడే శివార్పణం అయిపోయింది. దాన్ని మళ్ళా నివేదించవలసిన అవసరం లేదు. మీరు మాత్రం ఏ నామమూ పలకకుండా కోసారు. అందుకే వేరే పొయ్యిలో వేరేగా వండి స్వామికి నివేదించాను.'*** ఆ భక్తునికి ఒళ్ళు గగుర్పొడిచింది ఈ విషయం విని. ఆ దంపతులిద్దరూ ఆయనకు నమస్కరించారు. ఆ ఆచి భక్తిని, జ్ఞానాన్ని మెచ్చుకుంటూ వెళ్ళిపోయాడు. అన్నాన్ని అలా అర్పించినవారు ఆ దంపతులిద్దరూ.

*ఇంతటి నిస్వార్థ అతిథి భోజనం పెట్టినదానికి ఫలప్రాప్తి ఏమిటో తెలుసా? కొన్ని సంవత్సరాల తరువాత వారు షష్టిపూర్తి చేసుకుని, ఒక మహాశివరాత్రి నాడు కుంబేశ్వరుని దేవాలయంలో నాలుగు యామపూజలను చూసారు. ఇంటికి వచ్చిన తరువాత పూజ గదిలో కూర్చున్న ఆ తల్లికి శోష వచ్చినట్టు అయ్యి, బయటకు వచ్చి కొనఊపిరి తీసుకుంది. దీన్ని చూసి కంగారుగా చట్టియార్ పరుగుపరుగున వచ్చి, నేలపైన పడిపోయాడు. అంతే! మహాశివరాత్రి రోజు ఇద్దరూ ఒకేసారి శివసాయుజ్యం చేరుకున్నారు. నిరంతర అతిథిసేవ, అన్నదానం వారికి ఆ సద్గతి కలిగేట్టు చేసింది. ఇప్పటికి ప్రతి మహాశివరాత్రికి నేను ఆ దంపతులను స్మరిస్తాను. అన్న దానాన్ని అంత గొప్పగా చేసిన మహాత్ములు వారు".*

స్వామి వారు చెప్పడం ముగించారు. అక్కడున్న ప్రతి ఒక్కరి కళ్ళల్లో నీరు కారుతోంది. మహాస్వామి వారు లేచి నిలబడి, "మద్యాహ్నం రెండు గంటలు అయినట్టు ఉంది. అందరికి ఆకలిగా ఉంటుంది. వెళ్ళండి. లోపలికి వెళ్ళి భోజనం చెయ్యండి" అని అందరిని పంపించారు.

-- శ్రీ యస్. రమణి అన్న, శక్తి వికటన్ ప్రచురణ

# 5. అపూర్వ శంకరులు

పరమాచార్య స్వామివారి భక్తులు కుంభకోణం శ్రీనివాసశాస్త్రి గారు చెప్పిన ఈ సంఘటన.

శ్రీ ఆదిశంకరాచార్య శిష్యులైన శ్రీ పద్మపాదాచార్యులు వారి రచనల్లో ఒకచోట, ఆదిశంకరుల గురించిన విశేషణాలు చెబుతూ, “ఆయన అపూర్వశంకరులు, సాక్షాత్ పరమేశ్వరుల అవతారం. నాగాభారణాలను, ఏనుగుచర్మాన్ని, పులిచర్మాన్ని, అష్ట ఐశ్వర్యాలను విడిచిపెట్టి, సన్యాసరూపంతో శిష్యులతో వచ్చినవారు ఆదిశంకరులు” అని అంటారు.

ఇప్పుడు శ్రీనివాసశాస్త్రి గారి అనుభవంలో శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతి స్వామివారు - మన పరమాచార్య స్వామివారు కూడా అపూర్వ శంకరులే అని.

అప్పుడు మహాస్వామి వారు శివాస్థానంలో మకాం చేస్తున్నారు. పన్నెండు సంవత్సరముల బాలుడు అక్కడకు వచ్చి స్వామివారి ముందు నిలబడ్డాడు. ఏడుస్తూ స్వామివారికి తన బాధను చెప్పుకుంటున్నాడు. “శ్రీ పెరియవ! నాకు తండ్రి లేదు. మా అమ్మ, చెల్లి బాంబేలో ఒక ఇంటిలో ఉన్నారు. ఆ ఇంట్లో మా అమ్మ వంటమనిషిగా చేస్తోంది. నన్ను ఇక్కడ మద్రాసులో ఒక క్రైస్తవ పాఠశాలలో వేశారు. ఇప్పుడు నేను ఎనిమిదవ తరగతి చదువుతున్నాను. మంచి మార్కులు తెచ్చుకుంటున్నాను. ఇప్పుడు అక్కడ నన్ను వారు క్రైస్తవంలోకి మారమని, అలా మతం మారితే ఎం.ఏ. డిగ్రీ దాకా చదివించి ఉద్యోగం కూడా ఇప్పిస్తామని చెబుతున్నారు.

కాని నాకు మతం మారడానికి ఇష్టం లేదు. నాకు ఉపనయనం చేసుకోవాలని ఉంది. నాలుగు నెలల నుండి మా అమ్మ దగ్గర నుండి నాకు ఎటువంటి సమాచారము, ఉత్తరాలు రాలేదు. మాతల్లికి, చెల్లికి ఏమి జరిగిందో నాకు తెలియడంలేదు”.

మొత్తం విషయం అంతా స్వామివారికి చెప్పి, ఏడుస్తూ నిలబడ్డాడు. ఆ పిల్లాణ్ణి శివాస్థానంలోనే ఉండమని ఆదేశించారు స్వామివారు. పది, పదిహేను రోజులు గడిచిపోయాయి. ఆ పిల్లాణ్ణి స్వామివారు ఎలా కరుణిస్తారో ఎవరికీ అర్థం కావడంలేదు.

ఒకరోజు పరమాచార్య స్వామివారి దర్శనం కోసం శివాస్థానానికి నలభై మంది భక్తులు వచ్చారు. వారందరూ బాంబే నుండి వచ్చామని, స్వామివారి దర్శనం ముగించుకుని వెళ్ళిపోతున్నారు. వాళ్ళని వెనక్కు పిలవమని శిష్యులను ఆదేశించారు స్వామివారు. అందరూ మరలా స్వామివారి వద్దకు వచ్చారు. స్వామివారు వాళ్ళందరిని పేర్లు ఇతర వివరాలు తెలపమని అడిగారు. అందుకు వారు ఎంతగానో సంతోషించారు.

అందరూ వారి వారి వివరాలు చెబుతున్నప్పుడు, ఒక వ్యక్తి పేరు చెప్పగానే, ఆ పిల్లవాణ్ణి తీసుకురమ్మని శిష్యులకు చెప్పారు స్వామివారు. తన పరిస్థితిని అతనికి చెప్పమని ఆ అబ్బాయిని ఆదేశించారు స్వామివారు. పిల్లవాని పరిస్థితి విని అతను కదిలిపోయాడు. ఆ పిల్లాణ్ణి ఇంతకుముందు ఎప్పుడూ చూడలేదు, కాని అతను చెప్పిన వివరాల ప్రకారం అతని తల్లి, చెల్లి పనిచేస్తున్నది తన ఇంటిలోనే అని అతను అర్థం చేసుకున్నాడు.

ఆపిల్లాణ్ణి తను ఇంతకుముందెప్పుడు చూడలేదని, అతని తల్లి, చెల్లి తన ఇంట్లోనే ఉంటారని తెలిపాడు. కాని నాలుగునెలల క్రితం ఆమె చనిపోయిందని చెప్పాడు. పిల్లాడిపాఠశాల యాజమాన్యానికి చెప్పినా వాళ్ళనుండి స్పందనలేదని చెప్పాడు. మొత్తం కార్యక్రమాలన్నింటినీ  పిల్లాడి చెల్లి చేత చేయించాడు. పరమాచార్యస్వామివారి దర్శనం తరువాత మద్రాసుకు వెళ్లి ఆఅబ్బాయిగురించి విచారించాలనుకున్నట్టు తెలిపాడు. కాని మహాస్వామివారి అనుగ్రహం వల్ల పరమాచార్య స్వామివారి సన్నిధిలోనే ఆ పిల్లవాడు లభించాడు.

తరువాత మహాస్వామివారు ఇలా ఆదేశించారు. “నీతోపాటు ఈ పిల్లవాణ్ణి బాంబే తీసుకునివెళ్ళు. తన తల్లికి జగవలసిన కార్యక్రమలన్నిటిని ఈ పిల్లాడి చేత చేయించు. నీ స్వంత బిడ్డలాగా ఆదరించు. ఇతని చెల్లి పెళ్లి చేసే బాధ్యత కూడా నీదే” ***ఎవరో తెలియని ఇద్దరు వ్యక్తుల మధ్య ఉన్న సంబంధాన్ని తెలుసుకోవడం ఇతరలుకు సాధ్యం కాదు, కేవలం అది ఈశ్వరునికే సాధ్యం.***

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం!
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం !!

# 6. నక్తాల్ విశేషం(కార్తీక మాసంలో ఉపవాసం)

నాలుగు దశాబ్దాల క్రితం ఆంధ్రప్రదేశ్ లో తుఫాను వచ్చి ఎంతో ప్రాణనష్టం, ఆస్తినష్టం జరిగి దివిసీమ మొత్తం అతలాకుతలం అయిన రోజుల్లో జరిగిన సంఘటన ఇది.

మా మావయ్యగారు శ్రీ ఆలూరు వెంకటరమణారావు గారు అప్పుడే వ్యాపారంలో నిలదొక్కుకునే ప్రయత్నంలో ఒక చిన్న వ్యాపారం మొదలు పెట్టారు. అహర్నిశలు కష్టపడి వ్యాపారం చేసి, మంచి ఫలితం వచ్చే దశలో తుఫాను కారణంగా తీవ్ర నష్టం వాటిల్లింది. అప్పటి వరకు పెట్టిన పెట్టుబడి, పడిన కష్టం అంతా బూడిదలో పోసిన పన్నీరు వలే వ్యర్థమైపోయింది. మళ్ళీ ధైర్యంగా వ్యాపారం కొనసాగిద్దామంటే వారు చేసే ఆ వ్యాపారానికి రోజుకు సుమారు రూ.120 అవసరమవుతాయి. కానీ ఆ సమయంలో వాటికి కూడా ఇబ్బంది పడాల్సిన పరిస్థితిలో ఉన్నారు.

అప్పుడు మహాస్వామి వారు చాతుర్మాస్య దీక్షలో ఉన్నారని, వెళ్లి ఒకసారి దర్శనం చేసుకుందామని అనుకున్నారు. స్వామివారి దగ్గరకు అప్పటికే కొన్ని సార్లు వెళ్లి దర్శనం చేసుకున్నారు, కాని ఈ ఆపత్కర సమయంలో సహాయం కానీ సలహా కానీ అడిగే ధైర్యం చేయలేకపోయారు. మహాస్వామి వారిని అడిగితే మార్గం సూచిస్తారు అనే నమ్మకం ఉన్నా, వెళ్లి అడిగే ధైర్యం చెయ్యలేదు. నెమ్మదిగా వేరే ప్రయత్నాలు చేస్తుండగా, స్వామివారు దీక్షలో ఉన్న ప్రాంగణం దగ్గరలో ఉన్న ఒక సిమెంట్ ఫ్యాక్టరీలో పని ఉండడం వల్ల మా మావయ్యగారు వెళ్ళవలసి వచ్చింది. ఆ పని ముగించుకుని అలాగే స్వామి వారి దర్శనం కోసం వెళ్లారు.

అప్పుడే పూజలు ముగించుకుని స్వామి వారు ఏకాంతంలో ఉండగా, దర్శనానికి వెళ్లిన వీరిని పిలిచారు. ఆశీర్వచనం కోసం వెళ్లగా, సమస్య చెప్పాలా వద్దా అని మథన పడుతుండగా, మహాస్వామి వారు "నక్తాల్ విశేషం" అని అన్నారు. అదేంటో వీరికి అర్థం కాలేదు. కొద్దిసేపటితరువాత మరలా, "నక్తాల్ విశేషం" అని అన్నారు. అప్పుడు పక్కనే ఉన్న చంద్రమౌళి శాస్త్రి గారు మా మావయ్యగారితో, "స్వామి వారు మిమ్మల్ని ఉద్దేశించే చెప్పారు" అని చెప్పారు.

"నక్తాల్ అంటే ఏమిటో మీకు తెలుసా? " అని అడిగారు శాస్త్రి గారు.

"తెలీదు స్వామి" అని చెప్పారు.

"కార్తీక మాసంలో ఉపవాసం చేస్తారా?" అని అడిగారు.

"కార్తీక మాసంలో విశేషమైన రోజులలో ఉపవసిస్తాను స్వామి" అని చెప్పారు. అప్పుడు శాస్త్రి గారు **"నక్తాల్"**అంటే ఏమిటో వివరించారు.

***ఈశ్వరప్రీతికరమైనకార్తీకమాసంలో క్రమంతప్పకుండ శక్తి కొలది ఈశ్వరారాధన చేసి, ఉదయంనుండి ఉపవాసంఉండి, సూర్యాస్తమయంలో దీపారాధన చేసి, నక్షత్రదర్శనం తరువాత ఈశ్వర ప్రసాదం(భోజనం) తీసుకోవాలి***. కానీ ఆరోజే, కార్తీక మాసం చివరి రోజు కావడంతో, రానున్న కార్తీక మాసం నుండి తప్పక ఆచరిస్తానని స్వామివారికి నమస్కరించి సెలవు తీసుకున్నారు.

*అప్పటి నుండి ప్రతీ సంవత్సరం క్రమం తప్పకుండ కార్తీక మాసంలో* ***నక్తాల్*** *ఆచరిస్తూ, ఈశ్వరానుగ్రహం పొందుతూ వచ్చారు.* ***మహాస్వామివారి సూచనమేరకు, ఈశ్వరానుగ్రహం వలన చేపట్టిన వ్యాపారాలన్నీ దినదినాభివృద్ధి చెందుతూ లక్ష్మీకటాక్షం సిద్ధించింది.*** *స్వామివారిఅనుగ్రహంతో "నీరజగ్రూప్ అఫ్ కంపెనీస్" స్థాపించి వాటికి చైర్మన్ గా వ్యవహారబాధ్యతలునిర్వహిస్తున్నారు.* ఒంగోలు పట్టణంలో "**శ్రీగిరి శ్రీవెంకటేశ్వరస్వామి వారి దేవస్థానం**" నిర్మించి, వ్యవస్థాపకధర్మకర్తగా వైఖానసఆగమ శాస్త్రానుసారం స్వామివారికి ఉపచారములుజరిపిస్తున్నారు. వేద విద్యాభ్యాసం ప్రాముఖ్యత, ఆవశ్యకత ఎరిగిన వారై వారి తల్లితండ్రుల పేరుమీద వేదపాఠశాల స్థాపించి "వేదవిద్యా ప్రవర్తక" అని గౌరవం పొందారు. నాలుగు దశాబ్దాలుగా మహాస్వామివారి సూచన మేరకు "నక్తాల్" ఆచరిస్తూ ఈశ్వరానుగ్రహం పొందుతూ ఆస్వామివారి సూచనానుసారం సేవ చేసుకుంటున్నారు.

-- ఆలూరు కమలా దేవి, ఒంగోలు

# 7. “నీకు తెలియదా! నీబాలాజీ ఇక్కడే ఉన్నాడు”

పరమాచార్య స్వామి వారు అప్పుడు మహారాష్ట్రలో మకాం చేస్తున్న కాలం. ఒక జమీందారు (సంపన్నుడైన భూస్వామి), స్వామి వారికి సౌకర్యవంతమైన విడిది కోసం వారి అవసరాలన్నీ జాగ్రత్తగా చూసుకునే వాడు. ఆయనదగ్గర పనిచేసే ఒకసేవకుణ్ణి ఈ ఏర్పాట్లలో ఏమి లోపం రాకుండా స్వామివారి నిత్యఅవసరాలు చూసుకోవడానికి ఉంచాడు.

ఆ యువకుని పేరు పవార్. ఆయువకుడు స్వామివారు అక్కడున్నన్ని రోజులు స్వామివారికి అనన్యమైన సేవచేసాడు. పరమాచార్యస్వామివారు ఆయువకుని భక్తికి, సేవానిరతికి ఎంతో ప్రీతిచెందారు. అక్కడి విడిది ముగియబోతుండగా, స్వామివారు ఇక బయలుదేరవలసిన సమయంలో ఆభూస్వామితో, “ఈ యువకుడిని నాతో తీసుకుని వెళ్ళనా?” అని అడిగారు. ఆ భూస్వామి చాలా సంతోషించాడు.

అతనిఆనందానికి అవధులు లేవు. అతనిదగ్గర పనిచేసే సేవకుడు, మహాస్వామివారి వద్ద సేవకుడిగా ఉండబోతున్నాడు. పరమాచార్యస్వామివారిని సేవించ బోతున్నాడు.వెంటనే ఆభూస్వామి, “సంతోషంగా మీతో తీసుకుని వెళ్ళండి. అతని కుంటుంబాన్ని నేను చూసుకుంటాను. వారి అవసరాలన్నీ నేను తీరుస్తాను. కాబట్టి అతను తన కుంటుంబం గురించి దిగులు పడాల్సిన అవసరం లేదు” అని అన్నాడు. ఆనాటి నుండి ఆఉత్తరభారతీయ యువకుడు శ్రీమఠంలో ఒక సభ్యుడయ్యాడు.

శ్రీమఠం తరువాతిమకాంఏసౌకర్యములు లేనిచోట చేసారు. అది రాత్రి సమయం కావున వంటవండి మఠం సభ్యులందరూ భోజనాలు ముగించారు.అన్నపానాదులు ఎవరికీ లోటులేకుండా సమృద్ధిగాఉండాలని మహాస్వామివారి ఆజ్ఞ. మఠంలోపనిచేసేవారికి ఎవరికి భోజనం తక్కువ కాకూడదు.

అందరూ భోజనాలు ముగించిన తరువాత పరమాచార్యస్వామివారు వచ్చి, ఒక్కొక్కరిని భోజనం ముగించారా అని విచారిస్తున్నారు. అందరూ తిన్నామని చెప్పారు. చివరగా వారు బయటకు వచ్చి చూస్తే తలుపు దగ్గర పవార్ కాపలా ఉన్నాడు.

అతనికి తమిళం రానందున ఏమైనాతిన్నావా అని స్వామివారు సైగలతో అడిగారు. కాని అతను దీనంగా లేదు అన్నట్టుగా తలఅడ్డంగా తిప్పాడు. మహాస్వామివారు వెంటనే మఠంమేనేజరును పిలిచి, “ఈయువకుడు మనల్నినమ్మి ఇక్కడికి వచ్చాడు. అతనికి

భోజనంపెట్టాలని నీకు మరలాఎందుకుఅనిపించలేదు? అతను అడగకపోయినా అతనికి మన భాషరాకపోయినా నువ్వుఎందుకు అతని గురించి పట్టించుకోలేదు. కనీసం "తిన్నావా?" అని అయినాఅడిగావా? మీరందరూ తినేసి, వంటవార్పు ఆపేసారు. ఈ నిర్మానుష్య ప్రదేశంలో అతనికి తినడానికి ఏమి దొరుకుతుంది?" అని అడిగారు.

స్వామివారు చాలాకోపంగా మేనేజరుని మందలించారు . తరువాత మేనేజరు మహాస్వామి వారితో పవార్కు తినడానికి ఏమైనా ఏర్పాటు చేస్తాను అని చెప్పాడు.

కొద్దిసేపటి తరువాత ఒక వ్యక్తి సైకిల్లో ఒక క్యారేజితో అక్కడికి వచ్చాడు. ఇంకా ఇక్కడ గుడారాలలో వెలుగు కనపడడంతో ఇక్కడికి వచ్చాను అని చెప్పాడు. వారు అతన్ని వివరములు అడుగగా, అతను ఇక్కడికి కొద్దిదూరంలో ఉన్నవారికి భోజనం తీసుకుని వెళ్తున్నానని, దార్లోవెళ్తూ స్వామివారిని దర్శించాలని వచ్చానని చెప్పాడు. వెంటనే పరమాచార్య స్వామివారు ఆవ్యక్తితో పవార్ ను చూపిస్తూ, "నువ్వు తీసుకెళ్తున్న దాంట్లో కొద్దిఆహారం ఇతనికివ్వగలవా?" అని అడిగారు. ***అపారకరుణకు సాకారరూపమైన మహాస్వామి వారు తన సేవకుని కోసం ఒక అజ్ఞాతవ్యక్తిని అర్థిస్తున్నారు.***

వెంటనే ఆవ్యక్తి, "ఈ క్యారేజిలో ఆహారం ఉంది. అతన్ని తినమనండి. నేను వేరే ఏర్పాట్లు చేసుకుంటాను" అని క్యారేజిని ఇచ్చి వెళ్ళిపోయాడు. వారు దాన్ని తెరవగా అందులో ఉత్తరభారతీయుల అహారమైన వేడివేడిచపాతీలు, కూరగాయల సబ్జి ఉన్నది. స్వామివారునవ్వుతూ పవార్ వైపు చూసి తినమన్నారు. తన కోసం ఇలా ఎవరినో మహాస్వామి వారు అర్థించడం చూసి పవార్ కదిలిపోయాడు. **తరువాత ఆవ్యక్తి ఎప్పుడూ మళ్ళా ఆ క్యాంపు వైపు కాని రాలేదు. కనీసం అక్కడ వదిలిపెట్టిన క్యారేజి తీసుకుని వెళ్ళడానికి కూడా రాలేదు.**

పవార్కు మహాస్వామివారే ప్రపంచంలా మారిపోయింది. మఠంలో శాశ్వత ఉద్యోగి అయిపోయాడు. పరమాచార్య స్వామివారు మేనాలోనికి (అందులోనే స్వామివారు నిద్రపోయేవారు) వెళ్ళేవరకు అన్నీ తానై సేవించేవాడు. అన్ని అవసరాలని తీర్చేవాడు.

కొన్ని సంవత్సరాల తరువాత పవార్ కుటుంబం స్వామివారి దర్శనానికి కాంచీపురం వచ్చింది. కొన్ని రోజులు ఉండి స్వామి వారిని దర్శించుకున్నారు. తరువాత

అక్కడి నుండి వారు తిరుమల వెళ్ళి శ్రీనివాసుణ్ణి దర్శించుకోవాలనుకున్నారు. పవార్ వచ్చి స్వామి వారికివారి కోరిక తెలుపగా "సంతోషంగా వెళ్ళి రమ్మను" అని చెప్పారు.

మనసులో పవార్ కు కూడా తన కుటుంబంతోవెళ్ళాలని ఉంది. దానికి మహాస్వామివారి ఆశీస్సులు, అనుమతి కావాలి. అదీకాకుండా తను వాళ్ళతోవెళ్తే స్వామివారి అవసరాలని ఎవరు చూసుకుంటారు. కావున కేవలం ఒక్కరోజు మాత్రమే వెళ్ళి వద్దామని స్వామి వారిని అనుమతి అడిగాడు.

స్వామివారు అతనితో, "నీకు బాలాజీ ని చూడాలని ఉందా? సరే వాళ్ళతో కూడా వెళ్ళు" అని సెలవిచ్చారు. పవార్ చాలా సంతోషించాడు.

స్వామివారుమేనాలోనికివెళ్ళగానే దానితలుపులు గట్టిగా మూయడం, ఉదయాన్నే స్వామివారికంటే ముందే మేల్కొని స్వామివారి మేనాతలుపులు తీయడం పవార్ దినచర్య. ఆరోజుఉదయం పవార్,అతనికుటుంబం తిరుమలవెళ్ళాలని నిశ్చయించుకొన్నారు.

***రోజూలాగే అరోజు కూడా మేనా తలుపులు తీసి ఉదయంచెయ్యవలసిన పనులన్నీ చేసి తిరుమలకువెళ్దాము అనుకున్నాడు. తెల్లవారగానే మేనా తలుపులు తీసి లోపలికి చూసి స్థాణువై భక్తితో కన్నుల నీరు కరుతుండగా స్వామివారికి సాష్టాంగం చేసి నమస్కరించాడు. అతనికి మేనాలో స్వామివారికి బదులుగా కలియుగప్రత్యక్ష దైవమైన తిరుమల శ్రీనివాసుడు దర్శనమిచ్చారు.***

మహాస్వామివారు తమ కరుణాపూరితమైన చూపులతో చూడగా,ఆ చూపులలో "**నీకు తెలియదా! నీబాలాజి ఇక్కడేఉన్నాడు అని**" అన్నట్టు తోచింది పవార్ కు. కొద్దిసేపు పవార్ మౌనంగా ఉన్నాడు. చిన్నగా స్వామివారిని చూస్తూ, "**నేను వారితో తిరుమల వెళ్ళడం లేదు**" అనిచెప్పి తన దినచర్యకు ఉపక్రమించాడు.

పవార్ తన మనసులో ***"అన్నీఅందించగలిగే దేవుడు ఇక్కడ ఉండగా దేవునికోసం వేరేచోట వెదకడం ఎందుకు?" అనుకున్నాడు*** స్వామివారికి ఎవర్ని ఎప్పుడు ఎక్కడ ఎలా అనుగ్రహించాలో బాగా తెలుసు. **వారు త్రికాలవేదులు, కాలాతీతులు**.

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం!
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం !!

# 8. బస్సు ఎందుకు మిస్సయింది?

ఒకసారి పరమాచార్య స్వామివారిదర్శనానికి అహ్మదాబాదు నుండి పండరీపురం వెళ్లాను. నేను నది ఇవతలి ఒడ్డుకు చేరుకునేటప్పటికి చీకటి పడింది. ప్రవాహం ఎక్కువగా ఉండడంతో ఇప్పుడు అటువైపు వెళ్ళడం క్షేమం కాదని, ఉదయాన్నే తీసుకుని వెళ్తానని పడవవాడు చెప్పాడు. కాని నేను ఈ రాత్రికే స్వామివారి దర్శనం చేసుకుని, ఉదయాన్నే బాంబేకు బయలుదేరి, రాత్రికి అహ్మదాబాద్ మెయిలు ఎక్కితే, మరుసటిరోజు మా విభాగం కేసు విషయమై కోర్టుకు వెళ్ళగలను అనుకున్నాను. కనీసం ఉదయం పదిగంటలకు బాంబే బస్సు దొరికినా, రాత్రికి అహ్మదాబాద్ మెయిలు ఎక్కితే, తెల్లవారున చేరుకోవచ్చని, కోర్టుకు వెళ్ళవచ్చని అనుకున్నాను.

ఉదయం ఏడుగంటలకు నదికి అటువైపు పరమాచార్య స్వామివారు మకాం చేస్తున్న చోటుకు వెళ్లాను. పరమాచార్య స్వామివారు లోపల ఉండి గట్టిగా మాట్లాడడం వినబడుతోంది కాని, తొమ్మిదైనా బయటకు రాలేదు. శ్రీ రామకృష్ణన్, బాలు మరికొందరు సాంబ్ర(నన్ను అలాగే పిలిచేవారు) వచ్చాడని, పదిగంటల బాంబే బస్సు ఎక్కితే మరునాడు అహ్మదాబాద్ వెళ్ళగలడని చెప్పినా స్వామివారి వద్ద నుండి ఎటువంటి సమాధానం లేదు. నాకు ఇక ఓపిక నశించిఏమిచేద్దామా అని ఆలోచిస్తున్నాను. చివరగా తొమ్మిది ముప్పావుకి, స్వామివారు బయటకు వచ్చి, మాకుటుంబం యోగక్షేమాలు అడిగి తెలుసుకున్నారు. నాకు సమయంమించిపోతూఉండడంతో,స్వామికిప్రణమిల్లిసెలవుతీసుకుందామని అనుకున్నాను, కాని నన్ను వేచియుండమన్నారు. చివరగా అన్నాదురై అయ్యంగార్ బంధువొకరిని పిలిచి, కారులో నన్ను బస్టాండులో దిగబెట్టమని చెప్పి, సాంబ్రకు పదిగంటల బస్సుదొరికితే ప్రయత్నించి చూడమని వ్యంగ్యంగా అన్నారు.

అనుకున్నట్టుగానే పదిగంటల బస్సు వెళ్ళిపోయింది. మరలా బస్సు ఒంటిగంటకే, కనుక ఇక నాకు అహ్మదాబాదు మెయులు దొరకదు. రేపు తెల్లవారుఝాము ఎక్స్ప్రెస్ దాకా ఎదురుచూడవలసిందే. హఠాత్తుగా పెద్దపెద్ద అంబులెన్స్ సైరన్లు దగ్గరలోని ఆసుపత్రులకు పరుగులుతీయడం కనిపించింది. విచారిస్తే ***పదిగంటలకు బాంబేకు బయలుదేరిన బస్సు ప్రమాదానికి గురయ్యిందని, చాలామందికి తీవ్రగాయాలు అయ్యాయని తెలిసింది. నడిచేదేవుని దివ్యదృష్టి, కరుణ నన్ను ఆప్రమాదం నుండి కాపాడాయి. ఒక్క క్షణంపాటు***

*ప్రాన్పడిపోయి, కళ్ళవెంట నీరుకారుస్తూ మహాస్వామివారిని తలచుకుంటూ అలా నిలబడిపోయాను. పరమాచార్య స్వామివారు కేవలం కంచిమఠంలోని అధిష్టానంలోనే లేరు, లక్షలమంది భక్తుల హృదయాలలో కొలువైఉన్నారు.*

-- సాంబ్ర కృష్ణమూర్తి. "మూమెంట్స్ ఆఫ్ ఎ లైఫ్ టైం" నుండి

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం!
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం !!

# 9. ఏది జీవహింస, ఏదికాదు?

1957లో పరమాచార్య స్వామివారు అప్పుడు చెన్నైలోని మైలాపూర్ సంస్కృత కళాశాలలో మకాం చేస్తున్నారు. అడయార్ థియోసాఫికల్ సొసైటి ఆధ్వర్యంలో శాఖాహార సదస్సుజరిగింది. ఆసమావేశానికి ప్రపంచం నలుమూలలనుండిప్రతినిధులు హాజరయ్యారు. కారణమేదైనప్పటికి జంతువులను చంపడం పాపం అని తీర్మానించారు. కాబట్టి మాంసాహారాన్ని వదలి అందరూ శాఖాహారులుగా మారాలి అనిచెప్పారు. అహింస, శాఖాహార ప్రాముఖ్యతపై జనంలో అవగాహన కలిగించడానికి చర్యలు కూడా చేపట్టాలని సూచించారు.

ఆ సదస్సు ముగిసిన తరువాత థియోసాఫికల్ సొసైటి అధ్యక్షుడు శ్రీ శంకర మీనన్ కొంతమంది పాశ్చాత్యులని పరమాచార్య స్వామివారి అనుమతితో వారి దర్శనానికి తీసుకుని వచ్చారు. స్వామి వారిని కలవాలని ఆ ప్రతినిధులు చాలా ఉత్సాహంగా ఉన్నారు.

శంకర మీనన్ అందరినీ పేరు ఊరుతో సహా స్వామివారికి పరిచయం చేసారు. వారిని పరిచయంచేసిన తరువాత స్వామివారిగురించి వారికి చెప్పబోతుండగా మహాస్వామి వారు వారించి, "నాగురించి నువ్వు ఏమి చెప్పనవసరం లేదు. నాగురించి వాళ్ళకు తెలిసింది చాలు" అని అన్నారు.

కొంతమంది ప్రతినిధులు స్వామివారిని కొన్ని ప్రశ్నలు అడగాలనుకున్నారు. స్వామి వారు దానికి అంగీకరించగానే మొదటగా వచ్చిన ప్రశ్న "**వైదిక యజ్ఞాలలో ఇచ్చే జంతుబలిని ఎలా సమర్థిస్తారు? అది పాపం కాదా?**"

అందుకు మహాస్వామి వారు **"అవును అది చేయతగినదే. అది పాపంకాదు"** అని బదులిచ్చారు. ఇది వినగానే వారందరూ ఫక్కుననవ్వారు. స్వామివారిని అవమానపరిచారు అని మీనన్ గారికి కోపం వచ్చింది. వారివైపు తిరిగి ఆవేశంతో, "నేను మిమ్మల్ని ఇక్కడకు తీసుకుని వచ్చింది స్వామివారి ఆశీస్సులకోసం. మీరు ఇలా అమర్యాదగా ప్రవర్తిస్తారు అని తెలిసుంటే నేను ఈ పనికి పూనుకునేవాణ్ణి కాదు" అని అరిచారు.

స్వామివారు మీనన్ ను శాంతపరిచారు. "వాళ్ళపై కోపంపడవద్దు. వారు ఒక స్పష్టతతో ఇక్కడికి వచ్చారు. జీవహింసపాపం అని అది ఏ కారణానికి అమోదయోగ్యం కాదని నిర్ధారణకు వచ్చారు. కాని నా సమాధానం దాన్ని వ్యతిరేకించడం వలన వాళ్ళు నవ్వారు. నన్ను అవమానపరచలాని వాళ్ళకు ఆలోచనలేదు. మనం, వారికి అర్థంఅయ్యే లాగా సమాధానం చెప్పాలి" అని శాంతంగా చెప్పారు.

మీనన్ కోపం తగ్గినతరువాత మళ్ళా స్వామివారు ఇలాచెప్పారు "ఒక హంతకుడు ఒకవ్యక్తిని చంపుతాడు. కోర్టు ఆవిషయాన్ని నిర్ధారించి ఆహంతకుడికి మరణ శిక్ష విధిస్తుంది. ఆ హంతకుడు పాపభీతి లేక ఆవేశంలో ఒకణ్ణి చంపాడు. మరి అతణ్ణి కోర్టు ఉరితీయడం జీవహింస కాదా? మరి న్యాయమూర్తి చెసినది పాపం కాదా?"

స్వామి వారి మాటలు వారిని అలోచనల్లో పడేసాయి. వారు చాలా విద్యావంతులు. సత్యప్రమాణములైన మాటలు స్వామివారు చెప్తున్నారని అర్థంచేసుకుని వారిమాటలు వినడానికి ఉత్సాహం చూపారు.

*మరలా మహాస్వామివారు, "నాలుగు రోడ్ల కూడలిలో ఒక ఆంబులెన్స్ వస్తే, అందరిని ఆపి ప్రాణాలు నిలబెట్టే ఆంబులెన్సును ముందు పంపిస్తాము. అంటే అంతమంది ప్రయాణం కంటే ఒకప్రాణం గొప్పది. వేరొక సందర్భంలో ఒక ఆంబులెన్సు, ఒక అగ్నిమాపకవాహనం వచ్చాయనుకుందాం. అప్పుడు ముందు అగ్నిమాపకయంత్రాన్ని పంపిస్తాం. అంటే ఒక్కడి ప్రాణం కంటే పది మంది ప్రాణాలు గొప్పవి. మరొక్క సంఘటనలో ఒక అగ్నిమాపక వాహనం, అత్యవసరంలో ఉన్న మిలటరి వ్యాను వస్తే ముందు మిలటరి*

*వ్యానును పంపిస్తాం. కొంతమంది ప్రాణాల కంటే దేశ రక్షణ గొప్పది. కాబట్టి అలాంటి సందర్భంలో దేశ రక్షణ కోసం కొంతమంది ప్రాణాలను లెక్కచెయ్యము.*

రాజ్యాన్ని రక్షించుకోవడానికి రాజు యుద్ధాలు చేస్తాడు. ఆ యుద్ధంలో కొన్ని వేలమందిని చంపుతాడు. ***ఒకర్ని చంపితేనే మరణదండన విధిస్తే, మరి ఆ రాజుకు ఎన్ని మరణదండనలు విధించాలి?*** కాని యుద్ధంలో గెలిస్తే పండగ చేసుకుంటారు. ఈ అన్ని సంఘటనల్లో మనం జీవహింసను అమోదిస్తాం. ఇలాంటి నియమాలన్నీ మనం ఏర్పరుచుకున్నవే. *అలాగే యజ్ఞాలలో ఇచ్చే జంతుబలులు పాపం కాదు. ప్రపంచశాంతి కోసం, మానవాళి క్షేమం కోసం ఇలాచేసినా పాపం కాదని వేదాలు ఘోషిస్తున్నాయి.*

వేదం అపౌరుషేయం. అది పరమాత్మునిఊపిరి కాబట్టి ఈశ్వరునకు - వేదాలకు అభేదం( వేరుకాదు అని ). వేదము శాశ్వతము, సత్యప్రమాణము. 'శాస్త్రాయ చ సుఖాయ చ'. వేదాలు, శాస్త్రాలు మంచినే బోధిస్తాయి. జగదాచార్యుడైన శ్రీకృష్ణ పరమాత్మ కూడా భగవద్గీతలో ఇదే చెప్పాడు.

**దేవాన్ భావయతానేనతేదేవాభావయంతువః !**

**పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ!!**

మనం యజ్ఞ యాగాదులను చేసి దేవతలను సంతృప్తి పరిస్తే, దేవతలు మనకు సకాల వర్షమును మంచి జీవితాన్ని ఇస్తారు. కాబట్టి **వైదిక యజ్ఞములలో చేసే జీవహింస సరిఅయినదే. దాని వల్ల పాపము లేదు. అంతేకాదు. సనాతన ధర్మంలో యజ్ఞము చేయిట హింస, పాపము అని కూడా చెప్పబడింది కాబట్టిచేయకూడదు. కాని ఎవరు చేయుకూడదు అనే విషయం మనం తెలుసుకొని ఉండాలి**.

వ్యాసభగవానుడు రచించిన భాగవతంలోదీనికిసంబంధించిన ఒక ఉపాఖ్యానము ఉంది. 'ప్రాచీనబర్హి' అను ఒకరాజు ఉండేవాడు. అతనికి ఆచార్యకాండయందు విపరీతమైన అభిమానం, మక్కువ. కాబట్టి లోకక్షేమం కోసం తరచుగా యజ్ఞ యాగాదులు చేసేవాడు. ఆ తరువాత అతనికి జ్ఞానంకలిగి అహంబ్రహ్మాస్మి స్థాయికి వెళ్ళిపోయాడు.అటువంటి స్థితిపొందిన వాడు ఆ స్థాయిలో ఉన్న సన్యాసి యజ్ఞయాగాదులు చెయ్యరాదు. కాని అతనికి వాటిపైన ఉన్నఇష్టంవల్లచేస్తున్నాడు.నారదమహర్షి వచ్చి అతనికి జ్ఞానోదయంకలిగించాడు. అప్పటినుండి అతను యజ్ఞయాగాదులు మానేసాడు.

కాబట్టి, "ఏది హింస, ఏది కాదు, ఎవరు ఏమి చెయ్యాలి? ఏమి చెయ్యకూడదు" అని చెప్పవలసినవి వేదాలు మాత్రమే కాని, నువ్వు నేను కాదు. మనకు వేదమే ప్రమాణం. చెట్లకు కూడా ప్రాణంఉందని ఈరోజు అందరికి తెలుసు. విత్తనం నుండి మొలకెత్తి చెట్టుగా మారి మళ్ళా ఎన్నో విత్తనాలను ఇస్తుంది. కాబట్టి విత్తనాలు తినడం కూడా హింసే. కాయగూరలు, ఆకుకూరలు కూడా జీవహింస కదా. అందుకే సన్యాసులు కూరగాయలు కూడా తీసుకోరు. జ్ఞానులు ఎండుటాకులు, నీరు, గాలి తీసుకుని బ్రతికేవారు అని శాస్త్రాలు చెప్తున్నాయి.

కాబట్టి వీటన్నిటి వల్ల మనకు తెలిసేదేమంటే ***కేవలం ఋషులు, సాధకులు తప్ప పూర్తి అహింస ఎవరూ పాటించలేరు. కాబట్టి అహింస అనేది వారివారి ఆశ్రమాన్ని బట్టి పాటించాలి. కాబట్టి గృహస్తు చేసే యజ్ఞయాగాదుల వల్ల జరిగే హింస పాపం కాదు. ఇది వేదప్రమాణం. కాబట్టి ఈ నియమాలను మనం ఉల్లంఘించరాదు***.

-- థిల్లైనాథన్, చెన్నై. మహాపెరియవళ్ – దరిశన అనుభవంగళ్ 4

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం!
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం !!

# 10. కళ్యాణం – కలవరం

ఆ కళ్యాణమంటపంలో నాదస్వరం మేళతాళాలు సుస్వరంగా వినిపిస్తున్నాయి. చిన్నపిల్లలుఅటూ-ఇటూపరిగెడుతూ,ఆడుకుంటూపెళ్ళివాతావరణాన్ని ఆహ్లాదపరుస్తున్నారు. మంటపంలో అందరూ తమతమ పనుల్లో నిమగ్నులై ఉన్నారు.

పెళ్ళికుమారుడు కాశీయాత్రకు బయలుదేరి బావమరిది కోరిక మేరకు తన చెల్లిని పెళ్ళి చేసుకోవడానికి అంగీకరించి తిరిగి వచ్చాడు. పెళ్ళికొడుకు, పెళ్ళికూతురు ఊయలలో కూర్చుని ఊగుతున్నారు. సువాసినులు రంగురంగుల అన్నపు ముద్దలను వారి భుజాల మీదుగా వేస్తున్నారు. తరువాత ఇద్దరూ ఒకరిచేతులొకరుపట్టుకుని కళ్యాణవేదికను ఎక్కి కూర్చున్నారు.

హఠాత్తుగా ఇంతటి ఆనందం ఆవర్ణమై మంటపంలోని సంతోషమయ దృశ్యాలు ఆగిపోయాయి. ఏం జరిగింది? అక్కడ కూర్చున్న పెళ్ళికుమార్తె హఠాత్తుగా కళ్ళుతిరిగి

కుప్పకూలిపోయింది. వెంటనే ఆఅమ్మాయికి మూర్ఛవచ్చింది. కాళ్ళు,చేతులు కొట్టుకోవడం ప్రారంభించింది. నోటి నుండి నురగ రావడం మొదలైంది.

అమ్మాయి తల్లితండ్రులు భయపడుతున్నారు, ఏంచెయ్యాలో పాలుపోక ఇరు కుటుంబాల వారు ఆందోళన చెందుతున్నారు. బంధువులొకరు వైద్యునికి కబురుచేసి ప్రథమ చికిత్సకోసం అమ్మాయిని పక్కకు మోసుకెళ్ళారు.

తరువాత జరుగుతుంది? వివాహం జరుగుతుందా? అందరిలోనూ ఇదేప్రశ్న. భగవంతుడా! ఎంతటి విషమపరీక్ష. అలామూర్ఛరావడం ఆఅమ్మాయికి ఇదే మొదటిసారి. మరి ఆ అమ్మాయి భవిష్యత్తేంటి?

ఇరుకుటుంబాలవారుపరమాచార్యస్వామివారిభక్తులు.లగ్నపత్రిక ముద్రించడానికి ముందే స్వామివారి అనుగ్రహం అనుమతి పొందారు.మరి ఇప్పుడు ఎందుకిలా జరిగింది? వివాహక్రతువు నిర్వహిస్తున్న పురోహితుడు తేరుకుని ఒక సలహా ఇచ్చాడు. ఆ సలహా వల్ల అందరికి కొంత ఉపశమనం లభించింది.

"చూడండి,ఎవరూకంగారు పడాల్సిన అవసరం లేదు. ముహూర్తానికి ఇంకా చాలా సమయం ఉంది.***మనందరకు పరమాచార్యులవారే రక్షకులు. ఎవరైనాఇక్కడ జరిగినదంతా స్వామివారికి విన్నవించి వారి సలహా తీసుకోండి. వారి ఆజ్ఞప్రకారం నడుచుకుందాం"*** వెంటనే ఆయన చెప్పినట్లు చేశారు. విషయమంతా మేనేజరుకు చెప్పగా వారు స్వామికి విశదపరిచారు.

స్వామివారు కొద్దిసేపుమౌనంగా ఉన్నారు. తరువాత మేనేజరుతో, "ఆ అమ్మాయి కులదైవం మహామాయి అమ్మవారు. ఆ అమ్మవారిని ప్రార్థించి అమ్మాయి తలకు కొన్ని వేపరెమ్మలు ధరింపజేయమని చెప్పు.వెంటనే స్వస్థత చేకూరుతుంది."అని చెప్పారు.

మేనేజరు ఈ విషయాన్ని ఫోన్లో ఆ అమ్మాయి తల్లితండ్రులకు చెప్పగా పెళ్ళికూతురు తల్లి వారి కులదైవం అయిన మహామాయిని ప్రార్థించి కొన్ని వేపరెమ్మలను అమ్మాయి తలకు గుచ్చింది. ఆశ్చర్యకరంగా వెంటనే ఆఅమ్మాయికి స్పృహవచ్చి లేచి కూర్చుంది.

అబ్బాయి తరుపువారు కూడా పరమాచార్యస్వామివారికి భక్తులగుటవలన ఎటువంటి ఆక్షేపణ చెప్పలేదు. పరమేశ్వరునిఅనుగ్రహం వల్ల సరైన ముహూర్తానికే చక్కగా

వివాహం జరిగింది. మిగిలిన అన్ని కార్యక్రమాలు పూర్తిచేసుకుని రెండు కుటుంబాలవారు కంచికి ప్రయాణమయ్యారు.

"పెరియవ అనుగ్రహం వల్ల పెళ్ళి సాఫీగా జరిగిపోయింది" అని అన్నారు ఇరు కుటుంబాల పెద్దలు వినయంతో.

అందుకు స్వామివారు "మహామాయిఅమ్మవారిఅనుగ్రహంవల్లచక్కగా జరిగింది" అని చిన్నగా నవ్వారు.

అమ్మాయి తండ్రి స్వామివారితో, "పెరియవ! మా అమ్మాయికి ఇలా ఎప్పుడూ మూర్ఛ రాలేదు. . ." అని అన్నాడు.

***"ఇప్పుడు ఆమెసంపూర్ణ ఆరోగ్యవంతురాలు" అని పరమాచార్య స్వామివారు చెప్పి, అమ్మాయి చక్కగాఉంటుంది అని చెయ్యెత్తి ఆశీర్వదించారు.***

అంతకంటే కావల్సినది ఏముంది?

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం!
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం!!

# 11. పరమశివుడు– పంచాక్షరి

ఆంధ్రదేశంలో కొంతమంది భక్తులు ఒక శివాలయం కట్టించారు. శివలింగాన్ని గర్భాలయంలోకి తీసుకుని వెళ్ళాలని వారు ప్రయత్నించగా వారు దాన్ని ఒక్క అడుగు కూడా ముందుకు కదపలేక పోయారు. వారు ఆశ్చర్యచకితులై ఆ విషయాన్ని పరమాచార్య స్వామివారికి చెప్పడానికి కంచి వచ్చారు.

స్వామివారు కొద్దిసేపు మౌనంగాఉండి తిరుచ్చి దగ్గర్లోని శ్రీ వైద్యనాథశాస్త్రి అనబడేవారిని ఒకరిని తీసుకుని రావాల్సిందిగా చెప్పారు. వారు వైద్యనాథ శాస్త్రిగారి చెవిలో ఏదో చెప్పి ఆ భక్తులకి వారిని మీతోపాటు తీసుకువెళ్ళండి అని చెప్పారు.

వారి ఊరికి రాగానే శాస్త్రిగారు రోజూ వారి నిత్యానుష్ఠానం తరువాత గంటల తరబడి జపం చేసేవారు. అక్కడి వారు కొద్దిగా కలవరపడ్డారు. వాళ్ళసమస్యను నివారించడానికి వారు ఏమి సలహా ఇవ్వలేదు అని. శాస్త్రిగారిని ఏమి అడగకుండా, ఏమి జరుగుతుందో చూద్దామని ఊరకుండిపోయారు.

శాస్త్రిగారు ఆ ఊరు వచ్చిన 21వ రోజున జపం ముగించుకుని శివలింగాన్ని గర్భాలయంలోకి తీసుకుని రావాల్సిందిగా వారికి చెప్పారు. వారి దాన్ని చాలా తేలికగా కదిలించగలిగారు.ఒక్క అడుగుకూడా ముందుకు కదలించడానికి కూడా వీలుకానంత బరువున్న ఈ శివలింగం ఇప్పుడు దూదిపింజలా చాలా తేలికగా ఉంది.

ఈ అద్భుతం ఏమిటో తమకు వివరించగలరని వారు శాస్త్రిగారిని వేడుకున్నారు. శాస్త్రిగారు వారితో తనకు కూడా ఏమి తెలియదని, పరమాచార్య స్వామివారు ఈ శివలింగం ముందు కూర్చొని ఇరవైయొక్క రోజులపాటు పంచాక్షరి జపించమని చెప్పారని అంతకు మించి తనకు ఏమి తెలియదని చెప్పారు.

పరమచార్య స్వామివారు ఈ 20వ శతాబ్దంలో కూడా పంచాక్షరి మహామంత్ర గొప్పదనాన్ని ప్రత్యక్షంగా చూపించారు **అప్పర్ కొన్ని శతాబ్ధాల క్రితం చూపించినట్టుగా**.

***అరవైమూడు మంది నాయనార్లలో నలుగురు ఆళ్వార్లుగా (అప్పర్, సుందరర్, జ్ఞానసంబంధర్, మాణిక్యవాచకర్) ప్రసిద్ధులు***. అందులో ఒకరైన **అప్పర్** ను శివద్వేషి అయిన జైనరాజు ఒక బండరాయికి కట్టి నదిలోకిసివేయించగా, **నిత్యమూ పంచాక్షరి**

**మహామంత్రమును జపించే అప్పర్ ను రక్షించడానికి ఆ రాయిని నీట మునగనివ్వక నీటిపైన తేల్చి రక్షించాడు పరమశివుడు.**

పంచాక్షరీమంత్రరాజం యజుర్వేదాన్తర్గతమైన రుద్రంలో వస్తుంది. "**నమఃశివాయ**" అనే ఆ మంత్రంలో '**శివ**' శబ్దం దాని **జున్ను**. **పాపపరిహారానికి పంచాక్షరిని మించిన విద్య లేదు .**

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం!
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం !!

# 12. ధర్మము – ధర్మాచరణము

నాకు గుర్తున్నంతవరకు అది 1965వ సంవత్సరం. పరమాచార్య స్వామివారు తిరుపతిలో మకాం చేస్తున్నారు. స్వామివారు వేంకటేశ్వర స్వామివారికి కళ్యాణోత్సవం చేయించారు(600/- టికెట్టు). కళ్యాణోత్సవం తరువాత దేవస్థానం వారు ప్రసాదాలను ఇచ్చారు. కళ్యాణోత్సవం చేయించిన వారికి స్వామివారి దర్శనం కల్పిస్తారు. వీరిని మామూలు క్యూలైన్లలో కాకుండా వేరేగా స్వామి దర్శనానికి పంపిస్తారు. ఆలయ పేష్కారు స్వామివారిపై ఉన్న అపరిమిత భక్తి వల్ల పరమాచార్య స్వామివారితో ఉన్న మా అందరిని శ్రీనివాసుని దర్శనానికి రమ్మని పిలిచాడు. మేము దాదాపు ఒక పదిహేను మందిమి దాకా ఉన్నాము.

అప్పుడు పేష్కారుతో మహాస్వామివారు, "కళ్యాణోత్సవం చేయిస్తే ఎంతమందిని దర్శనానికి అనుమతిస్తారు?" అడిగారు.

"ఆరు మందిని" అని పేష్కారు బదులిచ్చాడు.

"అలా అయితే మేము ఆరుమందిమి మాత్రమే ఈ విశేష దర్శనానికి వస్తాము. నేను, పుదు పెరియావ(జయేంద్ర సరస్వతి స్వామి), మరో నలుగురు" అని చెప్పారు.వెంటనే పేష్కారు "అందరూ వెళ్ళవచ్చు. . . ఏమి పరవాలేదు" అని అన్నాడు.

"**అది తప్పు**! అధర్మం. దేవస్థానం ఒక నియమం చేసింది. కళ్యాణోత్సవం టికెట్టుపై ఆరుమందికి విశేష దర్శనం అని. నీవు దేవస్థానం చిప్పంతివి(ఉద్యోగివి). **నీకు నాపైన ఉన్న భక్తివల్ల పదిహేనుమందిని దర్శనానికి పంపించడం సరికాదు. దీని వల్ల రెండు తప్పులు జరుగుతాయి. దేవస్థానం తీసుకున్న నిర్ణయాలను ఒకదేవస్థానం ఉద్యోగియే ధిక్కరించడం. అంటే నిబంధనలను పెట్టినవారే వాటిని పాటించకపోతే ఇక ఇటువంటి నిబంధనలు ఎందుకు? మరొకటి నియమాలను అతిక్రమించడానికి నేనే ఒక అవకాశం ఇచ్చినట్టు. కాబట్టి మేము ఆరుగురు మాత్రమే వస్తాము"** అని చెప్పారు.

పేష్కారు ఏదో చెప్పబోతుండగా, మహాస్వామివారు మధ్యలోనే **"ధర్మం కేవలం ప్రచారం చెయ్యడానికి మాత్రమే కాదు. స్వయంగా దాన్ని తప్పక అనుష్టానించి చూపాలి"**.

"**రామో విగ్రహవాన్ ధర్మః - మూర్తీభవించిన ధర్మమే రాముడు**" అన్నట్లు ఈ సంఘటనను నాకళ్ళారా చూడడం చేత పరమాచార్య స్వామివారు సాక్షాత్ రెండవ రాముడై "**ఈ యుగానికి రాముడు**" అని అర్థమైంది.

[**చదివినది విన్నది ధర్మం కాదు ఆచరించినదే ధర్మం**. మొత్తం వేద వాంగ్మయ సారమంతా రెండే మాటలు. "**సత్యం వద - ధర్మం చర**". "సత్యం పలుకు - ధర్మం పాటించు". మరి ఏది సత్యం? ఏది ధర్మం? వేదం సత్యం. వేదం చెప్పినది ధర్మం. వేదప్రామాణమే సత్యం. అపౌరుషేయమైన వేదమే ప్రామాణం]

--- బ్రహ్మశ్రీ రామకృష్ణ దీక్షితర్, కంచి శ్రీమఠం విద్వాన్. మహాపెరియవళ్ – దరిశన అనుభవంగళ్ 1

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం!
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం !!

# 13. పంచాయతనం – పెరియవా

మాతండ్రిగారు **విష్ణుపురం బ్రహ్మశ్రీ జి.విశ్వనాథశాస్త్రిగళ్**, పరమాచార్య స్వామివారు విష్ణుపురం పర్యటనలో ఉండగా స్వామివారిని "నాకు పంచాయతన పూజ చేసుకోవాలనుంది" అని అడిగారట. పంచాయతనంలోని మూర్తులలో సాలగ్రామం, బాణలింగం, స్ఫటికం అప్పటికి లేకపోవడం చేత స్వామివారు కొంబకోణం చేరిన తరువాత మా నాన్నగారికి పంచాయతనాన్ని అనుగ్రహించారు.

పరమాచార్య స్వామివారు కుంబకోణం చేరుకోగానే, పంచాయతనాన్ని ఒక శిష్యునికిచ్చి విష్ణుపురం చేర్చవలసిందిగా ఆజ్ఞాపించారు.ఆ శిష్యుడు ఇవి ఎవరింటిలో ఇవ్వాలని అడుగగా, "ఏ ఇంటిలో అయితే నేను ఉంటానో ఆ ఇంట్లో ఇవ్వు" అని చెప్పారు.

ఆ శిష్యుడు విష్ణుపురం అగ్రహారంలోని ప్రతి ఇంటి మెట్లు ఎక్కి దిగి ఎక్కడా పరమాచార్య స్వామివారు ఎక్కడా కనపడకపోవడంతో అలసిపోయి మా ఇంటి ముందున్న అరుగుపై కూర్చొని లోపలికి తొంగిచూసాడు.

అతనికి ఒక్కసారిగా చాలాసంతోషం వేసింది. మా నాన్నగారు బయటకు వచ్చి "ఏమిటి సమాచారం?" అని అడిగారు.

"పరమాచార్య స్వామివారు ఈ పూజా పంచాయతనాన్ని మీకు ఇమ్మని చెప్పారు" అన్నాడు. "నాకా?"

అవును. **ఎవరింట్లో అనిచెప్పకుండా "స్వామివారు ఉన్న ఇంట్లో ఇమ్మని" చెప్పారు** మీ ఇంటి వసారాలో ఉన్న మహాస్వామి వారి చిత్రపటం నాకు చక్కగా కనిపించింది. స్వామివారు ఇక్కడ ఉన్నారు కాబట్టి ఈ ఇంట్లోనే ఇమ్మని చెప్పారు అని నాకు అర్థమైంది. ఇదిగోండి పంచాయతనం" అని మా నాన్నగారి చేతిలో పెట్టాడు.

**మహాస్వామివారు సర్వకాలములయందు మాఇంట్లో వసిస్తున్నరని మాకు ఎప్పుడూ నమ్మకం.**

**[ఆదిశంకరాచార్యులు నిత్యదేవతార్చనలో భాగంగా పంచాయతన పూజని ప్రవేశపెట్టారు.** పంచాయతనంలో శివుడు, విష్ణువు, అంబిక, గణపతి, సూర్యుడు ఉంటారు. ఏ సంప్రదాయానికి చెందినవారైతే ఆ మూర్తిని మధ్యలో ఉంచి, మిగిలిన వాటిని నలువైపులా ఉంచి పంచాయతన పూజ చేస్తారు. పంచాయతనంలో కరచరణాదులతో ఉన్న మూర్తులను కాకుండా - నర్మదానది వద్ద లభించే బాణ లింగం శివ సాలగ్రామం; నేపాల్ గండకి నది వద్ద లభించే విష్ణు సాలగ్రామం; కాళహస్తి సువర్ణముఖరి నది వద్ద లభించే అంబికా సాలగ్రామం; శోణభద్రా నది వద్ద లభించే గణపతి సాలగ్రామం; తంజావూరు వెల్లాం వద్ద లభించే సూర్య సాలగ్రామం]

--- శ్రీమతి మోహన పంచపకేశన్, మహాపెరియవాళ్ - దరిశన అనుభవంగళ్

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం!
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం !!

# 14. పూలు – పాదుకలు

కంచిమఠం దగ్గర కామాక్షి అని పూలుఅమ్మే ఒకావిడఉండేది. ఆమె పరమాచార్య స్వామివారిని అప్పా(నాన్న) అని పిలిచేది. రోజూ స్వామివారికి ఒక బుట్టెడు పూలతో అర్చన చేసేది. అప్పుడు స్వామివారు ఆమెతో, "ఇన్ని పూలను ఎందుకు వాడుతున్నావు? వీటిని నీవు అమ్మితే డబ్బు వస్తుంది కదా!" అని చెప్పేవారు. **"డబ్బు అంత గొప్పదా అప్పా? ఈ పూలతో నీకు అర్చన చేస్తే దానికంటే గొప్పదే నాకు లభిస్తుంది"** అని బదులిచ్చేది.

పరమాచార్య స్వామివారు నిద్రకుఉపక్రమిస్తే, స్వామివారిని ఎవరూ లేపకూడదని శ్రీమఠంలో ఒక నియమం ఉండేది. కాని ఈ నియమానికి కామాక్షి మినహాయింపు. ఆమె ఎంత పొద్దుపోయిన తరువాత అయినా రావచ్చు. ఎందుకంటే, తన వ్యాపారం మొత్తం పూర్తైన తరువాతనే రావాలని మధ్యలో రాకూడదని స్వామివారే ఆజ్ఞాపించారు. అంతటి కరుణాసాగరులైన స్వామివారు తనకోసమని ఆమెకు అన్నంపెట్టే వ్యాపారాన్ని వదిలితే ఒప్పుకుంటారా?

ఒకరోజు సాయింత్రం స్వామివారు, తొమ్మిదిగంటల వార్తలనువిని తనకు వచ్చి చెప్పే నాగరాజు మాటలను వింటున్నారు. మఠం బాధ్యతలు, నియమాలతో పాటు ప్రపంచంలో జరుగుతున్న అన్ని విషయాలను ఎప్పటికప్పుడు తెలుసుకోవడం స్వామివారికి అలవాటు. వార్తలను విశ్లేషించి, స్వామివారు నిద్రకు ఉపక్రమించేటప్పటికి చాలా ఆలస్యం అవుతుంది. ఆరోజు జాన అనే ఒక భక్తురాలు వెల్వెట్ తో చేసిన పాదుకలను తీసుకుని స్వామివారి దర్శనానికి వచ్చింది. స్వామివారు రోజంతా వాటినివేసుకునే ఉన్నారు. రాత్రి దాకా వాటిని వదలలేదు. నిద్రకు ఉపక్రమించడానికి ముందు స్నానాల గదికి వెళ్ళారు. స్వామివారికి వార్తలు చెప్పే నాగరాజు, "ఈరోజు స్వామివారు పాదుకలను విడువగానే, వాటిని నేను తీసుకుంటా; నా వద్ద స్వామివారి పాదుకలు లేవు" అని తనలో తాను అనుకున్నాడు. స్వామివారు పాదుకలను విడువకుండానే కూర్చున్నారు. అప్పుడే పూలమ్మే కామాక్షి వచ్చి, స్వామివారికి నమస్కరించింది. స్వామివారు వెంటనే పాదుకలను వదిలి, ఆమెకు ఇచ్చి, "ఇవి నీకే. తీసుకెళ్ళు" అని అన్నారు.

నాగరాజు బాధపడుతూ, "ఎప్పుడూ నేను ఏమితలచినా, దైవంమరొకలా తలుస్తుంది" అని వెళ్ళిపోయాడు. పూలమ్మే ఆ పేదరాలికి స్వామివారి అవ్యాజ కరుణ వల్ల

కలిగిన భాగ్యం అది. **ఎంతోమంది ఆ పాదుకల కోసం ఆమెను ప్రలోభపెట్టాలని చూశారు. వాటికోసం లక్షరూపాయలు కూడా ఇవ్వడానికి సిద్ధమయ్యారు. కాని వాటికి ఆమె లొంగలేదు.** తన అవసరాలు అన్నీ స్వామివారే చూసుకున్నారు. ఆమె ఇంటిలో పెళ్లిళ్లకు స్వామివారు బళ్లనిండా సామాను పంపేవారు.

స్వామివారు సిద్ధిపొందిన తరువాత కూడా, ఆమె సాయంత్రాలలో స్వామివారి అధిష్టానానికి పూలతో అర్చన చేసేది. కాని స్వామివారు ఉన్నంత వరకు, ఆమెను ఉత్తి బుట్టతో పంపలేదు అందులో కొన్ని పళ్ళను ఉంచేవారు. స్వామివారి సిద్ధిపొందిన తరువాత ఖాళీ బుట్టను చూసి చాలా బాధపడేది. ఒకసారి "అప్పా! నువ్వు ఉండిఉంటే, ఖాళీ బుట్టతో నన్ను పంపేవాడివా?" అని ఏడ్చింది. అప్పుడే, తనని విస్మయానికి గురి చేస్తూ, ఎవరో అధిష్టానం నుండి తనవైపు విసిరినట్టుగా ఒక మందారపువ్వు బుట్టలో వచ్చి పడింది.

ఈనాటికి ఇలాంటి ఎన్నో సంఘటనలు జరుగుతూనే ఉన్నాయి. స్వామివారు 'ప్రత్యక్ష రూపం'తో ఈనాటికీ ,ఏనాటికీ మనల్ని ఆశీర్వదిస్తూనేఉంటారు.

**తనను నమ్మినవారిని ఎన్నటికీ వదిలిపెట్టరు; ఇది నాలుగు వేదాల తీర్పు.**

-- శ్రీ గణేశ శర్మ.

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం!
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం !!

# 15. పెద్ద డాక్టర్!!

నాకుగుర్తున్నంతవరకు అది 1957వసంవత్సరం అనుకుంటా.కంచి పరమాచార్య స్వామివారు, జయేంద్రసరస్వతి స్వామివారు చెన్నై టి.నగర్ లోని రామేశ్వరం రోడ్డులోని ఒక ఇంట్లో మకాం చేస్తున్నారు. ఆవీధి చివర్లో ఉత్తరం వైపున నేను, మా తల్లితండ్రులతో కలిసి నివసిస్తున్నాను. అప్పుడు నావయస్సు 22సంవత్సరాలు. సెకెండరిగ్రేడ్ టీచర్స్ ట్రైనింగ్ స్కూల్ లో చదువుతున్నాను.

కొన్నిసార్లు మహాస్వామివారు ఉదయంపూట గాని సాయింత్రంవేళలో కాని మా ఇంటి ముందు నుండి వెళ్ళేవారు. అప్పుడు మాఅమ్మ ఇంటిముందు ముగ్గువేసి చేతిలో హారతి పళ్ళెం పట్టుకుని నిలబడేది. స్వామివారు మాఇంటి ముందు నుండి వెళ్ళినప్పుడల్లా స్వామికి హారతిచ్చి నేలపై పడి నమస్కరించేది. నాగరిక మనస్తత్వం, ధిక్కారధోరణి, యువరక్తం, మంచి చెడులు తర్కించలేని పరిణతి ఉన్న నేను మా అమ్మను తిట్టేవాడిని అలా చేసినప్పుడల్లా. “అతను ఒకసన్యాసి. ఎందుకు అతనికి నమస్కరిస్తావు? ఇలా అనాగరికురాలిగా అతనికి నమస్కరిస్తే, ఆయన నిన్ను కాపాడతాడా? ఇకనుండి ఇటువంటి తప్పు పనులు చెయ్యవద్దు”. ఈ నా మాటలు విని మా అమ్మ “పోరా పో! ఊరికే నీపని చూసుకో” అని బదులిచ్చేది.

రెండేళ్ళ తరువాత 1959లో చెన్నై మైలాపూర్ లోని పి.యస్. హైస్కూల్ లో ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్నాను. కొన్ని సంవత్సరాల తరువాత మా అమ్మకు ఆరోగ్యం చాలా పాడయ్యింది. అధిక రక్తపోటు వల్ల, మెరుగైన చికిత్స కోసం ఆమెని చెన్నైలోని తారమణిలో గల వి.హెచ్.యస్ ఆస్పత్రిలో చేర్పించాము. అప్పుడు నేను మైలాపూర్ కపాలేశ్వర దేవాలయం దగ్గర్లోని కళ్యాణి హోటల్ (ఇప్పుడు అది లేదు) యజమాని మణి అయ్యర్ కుమారులిద్దరికి ట్యూషన్ చెప్పేవాడిని. వారికుటుంబం పరమాచార్య స్వామికి భక్తులు. వారు తరచూ కంచివెళ్ళి స్వామివారిదర్శనం చేసుకునేవారు. స్వామివారి పాదసేవ కంటే మించినది ఏమి లేదు వాళ్ళ అభిప్రాయం.

మణి అయ్యర్ మైలాపూర్ దగ్గర మండవేలిలో ఉండేవారు. వాళ్ళఇంట్లో హాల్ ఎదురుగా ఉన్న చిన్న పూజగదిలో పరమాచార్యస్వామివారి చిత్రపటం ఉండేది. దాని ముందు ఎప్పుడూ ఒక దీపం వెలుగుతూ ఉండేది. నేను హాల్లో ఉన్న ఊయలలో కూర్చుని పిల్లలకు పాఠాలు చెప్పేవాడిని. పూజగది ఎప్పుడూ తెరిచి ఉండటం వల్ల నాకు స్వామివారి

చిత్రపటం కనపడగానే ఒళ్ళు జలదరించి వెంటనే వెళ్ళి పూజగది తలుపువేసి వచ్చేవాణ్ణి. ఇలా చాలాసార్లు జరిగింది.

అప్పుడే చెప్పినట్టుగా నేను మా అమ్మ అరోగ్యం గురించి ఆందోళన చేందేవాణ్ణి. మా అమ్మ నన్ను ఒంటరివాణ్ణి చేసి వదిలి వెళ్ళిపోతుందేమో అనే బాధతో కళ్ళల్లో నీళ్ళు తిరిగేవి. ఒకరోజు నేను పాఠం చెబుతుండగా అప్పుడే ఇంటికి వచ్చిన మణి అయ్యర్ నాతో, "ఏంటి సార్! చాలా ఆందోళన పడుతున్నారు. కళ్ళు కూడా ఎర్రబడ్డాయి, ఏంటి విషయం?" అని అడిగారు. కళ్ళు తుడుచుకుంటూ "ఏం లేదు మణిఅయ్యర్! మా అమ్మగారి ఆరోగ్యం బాగాలేదు. హైపర్ టెన్షన్. వి.హెచ్.యస్ ఆస్పత్రిలో చేర్చాను. అదే విషయమై బాధగా ఉంది" అని చెప్పాను.

మణి అయ్యర్: "మంచి డాక్టరుకు చూపించావా?"
నేను: "చెప్పాను కదా వి.హెచ్.యస్ ఆస్పత్రిలో చేర్పించాను అని" .

మణి అయ్యర్: "మరి వాళ్ళు ఏమి చెప్పారు?"
నేను: "ఆరోగ్యం బావుంది భయపడాల్సినది ఏమి లేదని చెప్పారు. కాని నాకు వాళ్ళ మాటలపై విశ్వాసం లేదు"

మణి అయ్యర్: "సార్ మీ సమస్య తీరేట్టు మిమ్మల్ని ఒక పెద్ద వైద్యుని దగ్గరకు తీసుకువెళ్తాను. వారిని చూడడంతోటే మీ అమ్మగారు బాగవుతారు"

నేను: "అలాగా? ఎవరు ఆ డాక్టర్? వారికి చూపిస్తే మా అమ్మకు నయమవుతుందా? వారు ఎక్కడుంటారు? వారిని ఎప్పుడు కలవొచ్చు? ఇప్పుడే మా అమ్మను తీసుకుని రానా?"
నా సమాధానంలోని ప్రశ్నలలో ఆ అమ్మ ఆరోగ్యం బాగుపడాలనే ఆరాటం, ఆత్రుత, ఉత్సాహం ఉన్నాయి.

మణి అయ్యర్: "మీ అమ్మగారు రావాల్సిన పనిలేదు. నువ్వు ఒక్కడివి వస్తే చాలు"
నేను: "మణి అయ్యర్! అనారోగ్యం నాకు కాదు, మా అమ్మకి.

నేను వస్తే మా అమ్మకి ఎలా నయమవుతుంది? ఆ పెద్ద డాక్టరు మా అమ్మను పరీక్షించడా?"

మణి అయ్యర్: "అవసరం లేదు సార్. ఆ పెద్ద డాక్టరు కేవలం మిమ్మల్ని చూసినంత మాత్రం చేత మీ అమ్మగారి ఆరోగ్యం బాగవుతుంది"
నేను: కొంచం అపనమ్మకంతో "నన్ను చూస్తే మా అమ్మ గారి ఆరోగ్యం బాగవుతుందా? అంతటి ఘనుడా? సరే అలాగైతే నేను ఇప్పుడే వస్తాను పదండి వెళ్దాం అతని దగ్గరికి"

మణి అయ్యర్: "ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు వెళ్ళలేము. వారు కాంచీపురంలో ఉంటారు"
నేను: "కాంచీపురంలోనా? అంత పెద్ద డాక్టరు అక్కడ ఎందుకున్నారు? ఎవరతను? యమ్.బి.బి.యస్సా లేదా యమ్.డి నా?"

మణి అయ్యర్: "వారు ఆ డిగ్రీలకన్నా అతీతులు. వారు వైద్యులందరికి వైద్యులు. (వారింటి పూజగదిలోని స్వామివారి చిత్రపటం వైపు చూపిస్తూ) ఈ డాక్టరు గురించే నేను చెప్తున్నది"
నేను: పగలబడి నవ్వుతూ "ఏంటి మణి అయ్యర్! ఈయనా డాక్టర్? వైద్యులకు వైద్యుడా? ఏం మాట్లాడుతున్నారు? ఒక సన్యాసి డాక్టర్ ఎలా కాగలడు? ఏదో పూజలు పద్ధతుల గురించి ఐతే చెప్పగలరు కాని. కాని మీరేమో ఈయన్ని డాక్టర్ అంటున్నారు. ఈయన మా అమ్మ అనారోగ్యాన్ని బాగుచేయగలరా? అది కేవలం మీ భ్రమ మాత్రమే"

మణి అయ్యర్: "ఏంటి మీనాక్షిసుందరం! బ్రాహ్మణుల ఇంటపుట్టి ఇలాంటి మాటలు మాట్లాడుతున్నవ్?"
నేను: "ఐతే ఏంటి సార్! మొదట ఒక పెద్ద డాక్టరు వద్దకు తీసుకుని వెళ్తాను అని చెప్పి ఇప్పుడు ఒక సన్యాసి వద్దకు తీసుకువెళ్తాను అంటున్నారు. ఇది ఎలా సాధ్యం?"

మణి అయ్యర్: "మీనాక్షిసుందరం, నీకు కావాల్సింది మీ తల్లి ఆరోగ్యం మెరుగుపడడం ఒక్కటే కదా? దానికి నేను పూచీ. మనం రేపే కాంచీపురం వెళ్తున్నాం సరేనా?"
నేను: "మణి అయ్యర్, మనం వెళ్తే నిజంగా మా అమ్మకు బాగవుతుందా?"

మణి అయ్యర్: "ఖచ్చితంగా! కేవలం వారిని దర్శించుకుని మీ తల్లి గురించి ప్రార్థించు ఆవిడకు నయమవుతుంది. నీకు మనఃశాంతి కూడా లభిస్తుంది"
నేను: "అలా అయితే సరే నేను కాంచీపురం వస్తాను. కాని అక్కడ మీరు నన్ను చొక్కా తీయమని, స్నానం చెయ్యమని, విభూతి-కుంకుమ పెట్టుకొమ్మని, నమస్కారం చెయ్యమని

ఇలాంటివి నాకు చెప్పకూడదు. వస్తాను - వారిని చూస్తాను - మా అమ్మ గురించి చెప్తాను అంతే!"

మణి అయ్యర్: "ఏమయ్యా! రోజూ స్నానం చెయ్యవా? అప్పుడప్పుడు చొక్కా విప్పవా? ఎప్పుడూ విభూతి-కుంకుమ పెట్టుకోలేదా? అవన్నీరేపుఒక్కరోజు చెయ్యి. నీ వంశానికొచ్చిన సమస్యేంటి?"

మరుమాట్లాడకుండా సరే అన్నాను. మరుసటి రోజు నేను, మణి అయ్యర్, నా సహోద్యోగి తిరు వేంకటరామన్ ముగ్గురము కంచి బయలుదేరి ఉషోదయ వేళలో కంచి చేరుకున్నాము. సర్వతీర్థ కుళంలో స్నానం చేసి, విభూతి-కుంకుమ ధరించి, పంచకట్టుకుని నా జీవితంలో మొదటిసారి కంచి శ్రీమఠం ద్వారం వద్దకు వచ్చాము. నిజం! నాలో ఏదో తెలియని భావన, ప్రశాంతత కొంత ప్రకంపనలు చోటుచేసుకున్నాయి.

మేము మఠం లోపలికి వెళ్ళాము. ముందరి హాల్లో కంచి మహాస్వామివారు. పెద్ద డాక్టర్! కూర్చుని ఉన్నారు. ఒక బియ్యం బస్తాకి ఆనుకుని కూర్చున్నారు. వారి ముందు పళ్ళబుట్టలు,పూలహారాలుఉన్నాయి.స్వామివారి దర్శనం కోసం వరుసలో నిలబడిఉన్నారు. మేము కూడా ఆ వరుసలో నిలబడ్డాము.

నాచేతిలో ఒక వెదురుబుట్ట అందులో కొన్ని పళ్ళు, ఆకుకూరలు, కాయగూరలు. సాలోచనగా సన్యాస చక్రవర్తి మహాస్వామివారిని చూశాను. అప్రయత్నంగా నా కళ్ళు వర్షించడం మొదలుపెట్టాయి.అవును నాకుతెలియకుండానే నేను ఏడుస్తున్నాను. నేనెందుకు ఏడుస్తున్నానో కారణం తెలియదు.

ఆ పలికేదేవుడు నన్నురమ్మన్నట్టు సైగ చేశారు. నేనుచిన్నగాప్రశాంతంగా దగ్గరకు వెళ్ళి నాచేతిలో ఉన్న బుట్టని అక్కడపెట్టి నాకుతెలియకుండానేస్వామికి సాష్టాంగం చేశాను.

"మీరు అష్టసహస్రం అయ్యర్లా?" (తమిళ అయ్యర్లలో ఒక శాఖ. మన ఆరువేల నియోగుల లాగా)

"అవును"

"కరుకుడిలో (తిరువయ్యారు దగ్గర) ఉన్న శేషాద్రి, కుంజు నీకేమవుతారు?"

"వాళ్ళు మా పిన్నికి బంధువులు"

"తంజావూరు రాజభవనం రిసీవర్ మీ తాతగారు. సుందరం అయ్యర్ కు ముందా లేదా తరువాతా?"

నాకు తెలియదన్నట్టు తలాడించాను. కొద్దిసేపు మౌనంగా ఉన్నారు.

స్వామివారు తలెత్తి, "మీ అమ్మని ఆస్పత్రిలో చేర్పించావు కదా? ఇప్పుడు ఎలా ఉంది?" అని అడిగారు

నేను ఇక్కడకు వచ్చిందే ఆ విషయం అడిగుదామని. స్వామివారికి నేనేమీ చెప్పనేలేదే! అదే విషయం స్వామివారు అడుగుతున్నారు. దీనికికూడా మౌనంగా రోదిస్తూ నిలబడ్డమే నా సమాధానం.

"**దిగులుపడకు! మీ అమ్మగారు కోలుకుని తిరిగి వస్తారు**"

అవును! ఆ పెద్ద డాక్టరు మా అమ్మ ఆయుష్షును మరికొంత పెంచారు. ఆ మహాత్ములు నావైపు కొద్దిసేపు తీక్షణంగా చూసి ప్రసాదం ఇచ్చి, "ఇది మీ అమ్మకు ఇవ్వు. తను ఆరోగ్యవంతురాలై ఇంటికి వస్తుంది" అని నన్ను ఆశీర్వదించారు.

ఈనాటికీ నేను, నాలోని అజ్ఞానాన్ని పారద్రోలి నన్ను సరైనదారిలో పెట్టిన ఆ "పెద్ద డాక్టరు"కి తలవంచి నమస్కరిస్తాను. "పెద్ద డాక్టరు" చెప్పినట్లుగానే మా అమ్మకు నయమై ఇంటికి తిరిగొచ్చింది. మా అమ్మను కాపాడింది వారే. ఈనాటికి వారు మమ్మల్ని సర్వదా రక్షిస్తున్నారు.

[తన ***తల్లి సదాచారపరాయణురాలు, భక్తురాలు కాబట్టి ఇతణ్ణి స్వామివారు ధర్మాచరణ వైపుతిప్పి, అతణ్ణి అతని వంశాన్ని కాపాడారు. మరి తల్లితండ్రులే నాస్తికులు, హేతువాదులు అయితే వాళ్ళ పిల్లల్నీ, ముందుతరాల్ని రక్షించేదెవరు? ఏ పుణ్యం అడ్డుపెట్టుకుని ఈశ్వరుడు నిన్ను రక్షిస్తాడు?***]

-- వి. మీనాక్షిసుందరం, సెక్రెటరి, హిందు ధర్మ మన్రం, చెన్నై-33. మహాపెరియవళ్ – దరిశన అనుభవంగళ్

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం ॥

# 16. ఒక రూపాయికి నెయ్యి

1981లో పరమాచార్య స్వామివారు పంధర్ పుర్(పండరీపురం)లో మకాం చేస్తున్నారు. స్వామివారి దర్శనం కోసం చాలామంది భక్తులు తరలివచ్చారు. ఆ వచ్చిన వారిలో ఉత్తరభారతీయుడైన ఒక సేఠ్ కూడా స్వామిని దర్శించుకోవడానికి వచ్చాడు. అతని వంతురాగానేస్వామికిసాష్టాంగంచేసిఒకనేతిడబ్బాసమర్పించి కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.

మహాస్వామివారు చిన్నగా "ఒక రూపాయి, ఒక రూపాయి" అని అన్నారు. అక్కడున్నభక్తులెవరికిస్వామివారుఏంచెప్తున్నారోఅర్థంకాక,ఒకరూపాయిసమర్పించమంటు న్నారేమోఅని అందరూ వాళ్ళ దగ్గరున్నడబ్బులో రూపాయి కోసం వెతకనారంభించారు.

స్వామివారు దగ్గరున్నశిష్యులని పిలిచి ఒకరూపాయి విలువచేసే నెయ్యి సమర్పించమంటే ఒకడబ్బా నెయ్యి ఎందుకుతెచ్చాడో ఆసేఠ్ ని అడగవలసిందిగా ఆదేశించారు. ఇప్పుడు అక్కడున్న వారందరూ అసలు మహాస్వామివారు రూపాయి నెయ్యి ఎందుకు అడిగారో అని ఆశ్చర్యానికి గురయ్యారు.

వారు ఆ సేఠ్ ని అడుగగా, అతను ఇలా చెప్పాడు.

కొన్ని రోజుల క్రితం నా కూతుర్ని ఎవరో అపహరించారు. అప్పుడు నేను చాలా భయపడ్డాను. మహాస్వామివారు నా కలలో కన్పించి ఒక రూపాయికి నెయ్యి కొనుక్కొని దాన్ని తీసుకుని పండరీపురం రావల్సిందిగా, అమ్మాయి క్షేమంగా ఇంటికి తిరిగివస్తుంది భయపడకు అని హామీ ఇచ్చారు.

స్వామివారి అనుగ్రహం వల్ల మరుసటిరోజే మా అమ్మాయి క్షేమంగా ఇంటికి తిరిగి వచ్చింది. నాకు చాలా సంతోషం వేసింది. నా సమస్యని తీర్చిన స్వామికి ఒకరూపాయి నెయ్యి కాకుండా ఒక డబ్బా నెయ్యి సమర్పించాలని తలచి ఇక్కడికి వచ్చాను" అని చెప్పాడు.సేఠ్ అసలు సంగతి చెప్పడంతో విషయమేంటో అందరికి అర్థమై మహాస్వామి వారి కరుణకు ప్రణమిల్లారు. పరమాచార్య స్వామివారు అవ్యాజ కరుణామూర్తి. వారి కృపాకటాక్షం వల్ల ఎంతటి సమస్య అయినా వీగిపోతుంది.

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం ॥

# 17. వాది – ప్రతివాది

ఒక ఊళ్ళో ఇద్దరు దగ్గరి బంధువుల మధ్య ఆస్తివిషయమై విభేదాలు పెరిగి శత్రువులయ్యారు. అది చివరికి న్యాయస్థానంలో వాజ్యం వేసుకునేదాకా వెళ్ళింది. వాళ్ళిద్దరి మధ్య వైరం వాళ్ళని కనీసం పలకరించుకోకుండా చేసింది. ఆ ప్రతివాది యొక్క కొడుకు పెళ్ళి కుదిరింది. అతను పెళ్ళి పత్రికను శ్రీమఠానికి తీసుకుని వచ్చి పరమాచార్య స్వామి వారి ముందు ఉంచాడు.

మహాస్వామి వారు దగ్గర నిలబడిఉన్న సేవకుణ్ణి చూసి, "బంధువులందరి ఇళ్ళకు వెళ్ళి పెళ్ళికి పిలుస్తాడేమో అతన్ని అడుగు?" అని చెప్పారు.

"అవును పెరియవ మేము బంధువులందరి ఇళ్ళకు వెళ్ళి పెళ్ళికి ఆహ్వానిస్తాము" అని చెప్పాడు.

స్వామివారు ఒక్కక్షణం మౌనం వహించి "అతని పై కేసు వేసిన వాది ఇంటికి వెళ్ళి పిలుస్తాడేమో అడుగు" అని అన్నారు. ఆ పెద్దమనిషి కొద్దిసేపు సంశయిస్తూ, "నేను అక్కడికివెళ్ళి అవమానపడితే అది చాలా బాధగా ఉంటుంది పెరియవ" అని బదులిచ్చాడు.

"అలాంటిదేమిజరగదు.అతనికిపెళ్ళిశుభలేకఇచ్చిఖచ్చితంగాపెళ్ళికి రావాల్సిందని చెప్పు" అని చెప్పారు స్వామివారు. అతను అన్యమనస్కంగానే తన వాది ఇంటికి వెళ్ళాడు. పరమాచార్య స్వామివారి మాటలు గుర్తుతెచ్చుకున్నాడు. "అతిథులను అగౌరవించడం మన సంప్రదాయం కాదు. ప్రతిఒక్కరిలోను మంచితనం ఉంటుంది"

బద్ధశత్రువైన ఇతను ఇలా తనఇంటికి వస్తాడని అతను కలలోకూడా అనుకోలేదు. అతణ్ణి చూడగానే వెంటనే గట్టిగా మనస్ఫూర్తిగా కౌగిలించుకున్నాడు. "స్వాగతం స్వాగతం" అని సంతోషంతో పలకరించి శుభలేక తీసుకున్నాడు. "మన శత్రుత్వాన్ని మరచి నా ఇంటికి వచ్చి మరీ నన్ను ఆహ్వానించావు. నేను ఖచ్చితంగా పెళ్ళి వేడుకకు వస్తాను" అని హామీ ఇచ్చాడు.

ఆహ్వానించడానికి వెళ్ళిన ఆవ్యక్తి మనస్సును మార్చుకున్నాడు."ఎంతమంచి సంస్కారమున్నవ్యక్తి. నేనుఅనవసరంగాఇతనితోగొడవపెట్టుకునిశత్రుత్వం పెంచుకున్నాను" అని అనుకున్నాడు. అతనితో ఇలా అన్నాడు. "అన్నా! కేసు,కోర్టుల గురించి మరచిపోదాం.

ఆ విషయాన్ని సావకాశంగా మనమే పరిష్కరించుకుందాం" అని ఇద్దరు పరమాచార్య స్వామికి నమస్కారం చేసారు.

-- 'ఇన్ ద ప్రెజెన్స్ ఆఫ్ డివైన్' పరమాచార్య అనుభవాల సంగ్రహం

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం ॥

# 18. కోపము – శిక్ష

అది ఎలెక్షన్ల సమయం. కాంచీపురం జిల్లా కలెక్టరు గారే స్వయంగా చీఫ్ ఎలెక్షన్ ఆఫీసరుగా బాధ్యతలు నిర్వహిస్తున్నందున కార్యాలయంలో మొత్తం అందరూ ఎన్నికల నిర్వహణలో తలమునకలయ్యారు. ఎల్లుండే ఎన్నికలు జరిగే రోజు.

ఢిల్లీ నుండి ఇద్దరు- ముగ్గురు ఐ.ఎ.యస్ అధికారులు జరగబోయే విధానసభ లోక్ సభ ఎన్నికల పర్యవేక్షణకై కంచికి వచ్చారు. అందులో ఒకరు చాలా నిఖార్సైన వ్యక్తిత్వం కలవారు మరియు చాలా కోపిష్టి కూడా. వారు వేరే రాష్ట్రంవారు వారు కావడం వల్ల వారికి తమిళం రాదు.

నేను తహసీల్దార్ కావడం చేత వారి బస మరియు బాగోగులు చూడటం నా కర్తవ్యం. వారిని కలిసిన కొద్దిసేపటికే వారి గుణగణాలను అంచనా వెయ్యగలిగాను. ఆయన భార్యా పిల్లలతో సహా రావడం చేత వారికి ప్రభుత్వ ట్రావెలర్స్ బంగ్లాలో సకల సౌకర్యాలతో వారికి విడిది ఏర్పాటు చేసాము. వారి మనసు పాడుకాకుండా చాలా జాగ్రత్తగా చూసుకోవల్సిందని నాకు పై అధికారులనుండి వచ్చిన ఆదేశం యొక్క సారం. వారికి కొన్ని తమిళ పదాలు తెలుసని కూడా నాకు తెలిసింది.

వారు కుటుంబ సమేతంగా పరమాచార్య స్వామివారిని చూడాలని నాకు చెప్పారు. నేను వారిని కంచి శ్రీమఠానికి తీసుకుని వెళ్ళాను. మేము అక్కడికి వెళ్ళేటప్పటికి స్వామివారు జపం చేసుకుంటున్నారు. శ్రీమఠం సేవకులొకరు అక్కడ నేలపైన ఒక జమఖానం పరిచి ఉంచారు. ఆ అధికారి కుటుంబ సమేతంగా దానిపైన కూర్చున్నారు. నేను వారి పక్కనే నిలబడి ఉన్నాను.

స్వామివారు దర్శనం ఇవ్వడం మొదలుపెట్టగానే నేను వారినందరిని స్వామివారి వద్దకు తీసుకుని వెళ్ళాను. మహాస్వామివారు ఒక చిన్న గదిలో చెక్క కుర్చీపై కూర్చుని ఉన్నారు. గది తలుపు ఇవతలి నుండి మేము స్వామివారి దర్శనం చేసుకోవాలి. ఆరోజు స్వామివారు మౌనవ్రతంలో ఉన్నారు. చేతిసైగలతోనే కొన్ని ప్రశ్నలను అడిగి ఆ ఆఫీసరు కుటుంబాన్ని ఆశీర్వదించి ప్రసాదం ఇచ్చి పంపించారు.

సరిగ్గా అదే సమయంలో కోపిష్టి యువకుడైన ఒకమఠం ఉద్యోగి అరవడం మొదలుపెట్టాడు."వాడుఎవడైతేఏంటి! వాడేమైనా పెద్దపోటుగాడా! రాస్కెల్! నా జమఖాణంపైన కూర్చోవడానికి వాడికి ఎంత ధైర్యం? మఠం పవిత్రత అంతా పోయింది. ఇప్పుడే రాష్ట్రపతికి టెలిగ్రాం చేస్తాను"

అతను అలాఅరవడం మాకు అవరోధంగా మారింది. నాకు చాలా బాధకలిగింది. పరమాచార్య స్వామివారి సమక్షంలో ఒక వ్యక్తి ఇలా అరవడం మఠాన్ని స్వామివారిని అవమానించినట్టే కదా? అతను ఇలా అరవడానికి కారణం తను జమఖాణంపైన కూర్చోవడమే అని ఆఫీసరుకు తెలిస్తేదాని పర్యవసానం మా పనిమీద కూడా పడుతుంది కదా!

ఒక పదిహేను నిముషాలు అలా అరిచి అతను వెళ్ళిపోయాడు. నేను స్వామివారిని మనస్సు లోనే ప్రార్థిస్తున్నాను "స్వామీ ఆ యువకుడు అరుస్తున్నది తను జమఖాణంపైన కూర్చున్నందువల్లే అని ఆ ఆఫీసరుకు తెలియకుండా చూడు" అని.

దర్శనం ముగించుకుని మేము మఠం నుండి బయటకు రాగానే ఆఫీసరు అడగనే అడిగాడు. "ఎవరతను? ఎందుకు అలాఅరుస్తున్నాడు? అది కూడా మహాత్ములైన స్వామివారిముందు".

నేను తెలివిగా చిన్న అబద్ధం చెప్పి తప్పించుకున్నాను. "ఈరోజు పౌర్ణమి కదా. ఆ యువకుడికి కొంచం చిత్తభ్రమ ఉంది. కాబట్టి అతను అలా ఎవరో ఒకరిపై అరుస్తూ ఉంటాడు" అని "ఓహ్ అలాగా! నువ్వు ఈ విషయం ముందే చెప్పిఉంటే అతనికోసం కూడా మనం స్వామివారిని ప్రార్థించేవారం కదా" అని తన ఔదార్యాన్ని చాటుకున్నాడు ఆఫీసరు.

క్రమశిక్షణకి కట్టుబాట్లకి మారుపేరైన మహాస్వామివారు ఈ అరుపులు విన్నారు. ఆరోజు దర్శనానికి వచ్చిన వారందరూ వెళ్ళిపోగానే ఆ యువకుడిని పిలిచి మందలించడమే కాకుండా మూడురోజులపాటు మఠంలోనికి రాకూడదని చెప్పారు.

వేరొక సేవకుని ద్వారా నాకు ఈ విషయం తెలిసింది. తప్పుచేసినవాడు ఎంతటి మేధావి, భక్తుడు అయినా అనాగరికులుగా కోపంతో ప్రవర్తిస్తే వాళ్ళకి శిక్ష తప్పదు

-- టి.యస్. కోదండరామ శర్మ, మహాపెరియవళ్ – దరిశన అనుభవంగళ్

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం ॥

# 19. పరమాచార్య స్మృతులలో..

1964లో వేసవి కాలంలో ఒక రోజు. కుటుంబంతో మద్రాసు నుండి విహార యాత్రకు వెళ్ళి మహాబలిపురం, తిరుకాళికుంద్రం నుండి తిరిగి వస్తున్నాము. చంగల్పేట్ వద్ద 'కాంజీవరం వైపుకు' అన్న సైన్ బోర్డు చూసి, కారు డ్రైవరుకు కారును ఎడమవైపు పోనిచ్చి 'దేవాలయాలనగరానికి' వెళ్ళమని చెప్పాను. మేము కంచి చేరుకునేటప్పటికి సాయంత్రం ఐదు గంటలు అయ్యింది.

వరదరాజస్వామి, ఏకాంబరేశ్వరుడు, కామాక్షి దేవాలయాలను చూసుకుని పరమాచార్యస్వామివారి దర్శనంకోసం శ్రీశంకర మఠానికి వెళ్ళాము. అప్పుడు స్వామివారు కంచికి దగ్గరలోని కిళాంబి అనే కుగ్రామంలో మకాంచేస్తున్నారని తెలుసుకుని అక్కడకు బయలు దేరాము. అక్కడి గ్రామస్తుడు ఒకరు మమ్మల్ని పలకరించి మహాస్వామివారు ఇప్పుడే కామాక్షి పూజకు ముందు చేసే గజపూజ మొదలుపెట్టారని, త్వరగా వెళ్ళమని చెప్పాడు. గజపూజ, కామాక్షి పూజ అయినతరువాత అక్కడున్న మేనేజరును స్వామివారిని ఎప్పుడు దర్శించుకోవచ్చు అని అడుగగా, మమ్మల్ని కొద్దిసేపు వేచియుండి తరువాత దగ్గర్లోని చిన్న నదిఒడ్డున దర్శించుకోవచ్చు అని తెలిపారు. అక్కడ స్వామివారు దర్భాసనంపై కూర్చుని సంధ్యవార్చుకుంటున్నారు. మేము స్వామివారి ముందు నేలపై పడి నమస్కరించాము. స్వామివారు నా భార్య సుబ్బలక్ష్మి వైపు చూసి, "నీవు నా సహాధ్యాయి తిరువిసైనల్లూర్ స్వామినాథన్ సోదరుని మనవరాలివి కదూ? వారి అబ్బాయి సుందరామన్ 1935లో S.S.L.C. పాసయ్యాడా?" అని అడిగారు. అతను ఆ సంవత్సరం కాక మరుసటి

సంవత్సరం పాసయ్యాడని చెప్పింది. మాది మాన్ కొంబు అని నేను తెలుపగా, వెంటనే స్వామివారు "నువ్వు నా కుంబకోణం ఎక్స్-రే డాక్టర్ యం.కె.సాంబశివన్ సోదరుని కొడుకువి" అని చెప్పారు. స్వామివారు మా రెండో అబ్బాయి నటరాజన్ వైపు చూసి, తనని డాక్టర్ చెయ్యాలని అనుకుంటున్నావా అని అడుగగా, స్వామివారి ఆశీస్సులతో ప్రయత్నిస్తాను అని తెలిపాను.

స్వామివారి ఆశీస్సుల ప్రకారం 1966లో మద్రాసు వివేకానంద కాలేజిలో ప్రి-యూనివర్సిటీలో చేరేటప్పుడు బైయాలజి గ్రూపు తీసుకొమ్మని చెప్పాను. అతను ఉత్తీర్ణుడైన తరువాత యం.బి.బి.యస్. కు ఎంపికయ్యాడు. కాని రుసుం కట్టడానికని వెళ్ళినప్పుడు తన పేరు అందులో లేదు. తనని ప్రెసిడెన్సి కళాశాలలో బి.యస్సి., రసాయన శాస్త్రం చదవమని చెప్పాను. 1969లో అత్యంత ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యి, వంద మందికి అవకాశం ఉన్న గ్రాడ్యుయేట్ కోటాలో యం.బి.బి.యస్ కు దరఖాస్తు చేసుకున్నాడు. కాని దేశం మొత్తంలో అత్యంత ఉత్తమ శ్రేణిలో ఉన్న ఐదుగురి అవకాశం ఉన్న యు.డి.సి.టి, బాంబేలో బి.టెక్ కు ఎంపికయ్యాడు. డాక్టర్ అయ్యే అన్ని ఆశలు పోయాయి. ఒకరోజు ఉదయం, వెంటనే స్టాన్లీ వైద్య కళాశాలో చేరాల్సిందని మద్రాసు ఎంపిక సంఘం నుండి టెలిగ్రాం వచ్చింది. ఇది జరిగింది డి.యం.కె ప్రభుత్వంలో ఉన్నప్పుడు. 1964లో మహాస్వామివారు ఆశీర్వదించి చెప్పిన జోస్యం నిజమయ్యి మా అబ్బాయి ఎంపికయ్యాడు. ఈరోజు మా అబ్బాయి నటరాజ్ రేడియాలజిస్ట్ గా మద్రాసులోని మూలక్కడైలో పేదవారికి వైద్యసహాయం అందిస్తున్నాడు. ఇవి మహాస్వామివారి ఆశీస్సులు.

నా జీవితంలో మరచిపోలేని రెండో సంఘటన 1978లో మేము హైదరాబాద్ లో ఉన్నప్పుడు జరిగింది. పరమాచార్యస్వామివారి భక్తురాలైన శుభశ్రీ, పరమాచార్య స్వామివారు మకాం చేస్తున్న సండూరుకు వెళ్లి ఎందుకు దర్శించుకోరాదు అని నన్ను అడిగింది. నేను వెంటనే బయలుదేరి, మరుసటిరోజు ఉదయానికల్లా చిన్న దేవాలయంలో జపం చేసుకుంటున్న మహాస్వామివారి ముందు నిలబడ్డాను. స్వామివారు సైగలతోనే నన్ను గుర్తుపట్టానని తెలిపి,అంతకు ముందురోజే ప్రధానమంత్రి ఇందిరాగాంధి రావాల్సిఉన్నదని తెలిపారు. ఇతురులవలె కాక కేవలం భక్తితో నేను అక్కడకు వచ్చానని తెలిపారు. స్వామివారు నన్ను ఆశీర్వదించాక ఇక నేను వెనక్కి తిరిగి చూసుకోలేదు.

1982లో మూడోసారి స్వామివారితో అతి ముఖ్యమైన సమావేశం గుల్బర్గ దగ్గర్లోని మహాగావ్ లో మకాం చేస్తున్నప్పుడు. నేను, నాభార్య ఉదయం ఐదుగంటలప్పుడు కారులో బయలుదేరి ఊరిశివార్లలో ఉన్న ఒక చిన్న సత్రం వద్ద కారు ఆపుతుండగా, ఒకావిడ పరిగెత్తుకుంటూ వచ్చి, త్వరగా అ సత్రం లోపలకు రమ్మని నా భార్యకు చెప్పింది. పరమాచార్యస్వామివారుమాకోసంవేచియున్నారని,వెంటనే లోపలకు తీసుకునిరమ్మన్నారని తెలిపింది. అసలు మేము వస్తున్నట్టు స్వామివారికి ఎలా తెలిసిందని ఆశ్చర్యపోయాము. మేము లోపలకు వెళ్ళగానే, స్వామివారు తమ శిష్యునితో ఈమె తన సహాధ్యాయి సోదరుని కూతురని, నేను మాన్ కొంబు డా. యం.కె. సాంబశివన్, కుంబకోణం అని సైగలతోనే తెలిపారు. వారు మమ్మల్ని ఆశీర్వదించి, అక్కడున్న అందరి భక్తులని సత్రంలో భోజనం చేసి వెళ్ళమని చెప్పారు.

ఈ సందర్భనం తరువాతనే మాకు రెండేళ్ళ పాటు ప్రపంచాన్ని ముఖ్యంగా యు.కె, ఐరోపు, యు.యస్.ఏ. చూసే అవకాశం లభించింది. 1987 మే 24న న్యూయార్క్ లో ఉన్నప్పుడు అక్కడున్న వినాయక ఆలయానికి వెళ్ళాము. మేము లోపలకు వెళ్ళగానే, ఆకడున్న అర్చకులు నన్ను పేరుపెట్టి పిలిచారు. మద్రాసులో శ్రీ జయేంద్ర సరస్వతి స్వామివారికి నాచేత పాదపూజ చేయించింది ఆయనే అని తెలిపారు. పరమాచార్య స్వామివారి ఆదేశానుసారం రెండేళ్ళ పాటు తను ఇక్కడకు వచ్చానని తెలిపారు. ఇది నా అరవయ్యో జన్మదినమా అని ఆయన అడుగగా, నేను డెబ్బైయవది అని తెలిపాను. అయితే అది సంపత్ పూర్తీ అని, మహాస్వామివారి అనుగ్రహం వల్ల ఆరోజు ఆ దేవాలయంలో పూజ చేయించుకుంటున్నానని చెప్పారు.

పరమేశ్వరావతరమైన పరమాచార్య స్వామివారి శతాబ్ది ఉత్సవాల సందర్భంగా నాకు గుర్తుకువచ్చిన కొన్ని సంఘటనలు ఇవి. నేను, నా కుటుంబ సభ్యులు అందరమూ పరమాచార్య స్వామివారు చిరకాలం జీవించాలని, వారి ఆశీస్సులతో విశ్వశాంతి, సర్వ మానవ సౌభ్రాత్రుత్వము వెల్లివిరియాలని కోరుకుంటున్నాము.

-- 'కైంకర్య శిరోమణి' కె. పద్మనాభన్. "kamakoti.org" నుండి

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం ॥

# 20. చేతివేళ్ళు - కొలతలు

శ్రీ ఆర్.ఆర్.శర్మ చాలాపేరున్న ఆర్కిటెక్ట్. ఒకసారి మహాస్వామివారు ఒక పనికోసం వారికి కబురంపగా వారు స్వామివారి దర్శనానికి వచ్చారు. వారు చెయ్యవలసినది చాలా చిన్నపని. రామేశ్వరంలో ఆదిశంకరాచార్యులు మరియు నలుగురు శిష్యులతో కూడిన ఒక నిర్మాణం చేస్తున్నారు. అది అగ్నితీర్థం నుండి చూసినా చక్కగా కనబడేట్టు ఉండాలి అని స్వామివారి ఆలోచన. కాబట్టి అది ఎంతటి ఎత్తులో ఉండాలో చెప్పడానికి శర్మగారిని పిలిపించారు.

ఇంత చిన్న విషయానికి అంత మేధావి అయిన తనను పిలిపించారని శర్మగారికి కొద్దిగా అసహనం కలిగింది. అంతేకాక, వారు పరమాచార్య స్వామివారిని చూసి మనసులో ఇలా అనుకున్నారు. "శంకరాచార్యుల గురించి ప్రజలందరూ అంతలా చెప్పుకుంటారు. కాని వీరేమో చెప్పుకోవలసినంతగా ఉన్నట్లు కనిపించడం లేదు. వీరు అసాధారణంగకూడా కనపడ్డంలేదు. పైగా అందరూఅనుకుంటున్నట్టు అంత మేధావులుగా కూడా అగుపించడం లేదు".

పరమాచార్యస్వామివారు ఎప్పటిలాగే తమ ధోరణిలో శర్మగారితో మాట్లాడుతున్నారు. వివిధ రకములైన కొలతలను చెప్పమన్నారు స్వామివారు.అవి 'అడుగు', 'గజము', 'మైలు' మొదలైనవి అని చెప్పుకొచ్చారు శర్మగారు.

కొద్దిసేపటి తరువాత స్వామివారు వారి చేతి మధ్యవేలు మొదలు నుండి ముంచేతి వరకు గల పొడవును ఏమని అంటారు అని అడిగారు. శర్మగారు వెంటనే 'గజము' అని జవాబిచ్చారు. మళ్ళా కొద్దిసేపటి తరువాత స్వామివారు అరచేతి వేళ్ళను బాగా తెరచి బొటనవేలి మొదటి నుండి చిటికెన వేలి మొదట వరకు ఉన్న దూరాన్ని ఏమని అంటారు అని అడిగారు. క్షణం ఆలస్యం చెయ్యకుండా 'జాన' అని చెప్పారు.

తరువాత స్వామివారు చేతి బొటనవేలిని చూపుడువేలిని చాచి దీన్ని ఏమంటారు అన్నట్టుగా శర్మగారి వంక చూసారు. ఆయన ఏమి చెప్పలేకపోయారు. అసలు అలాంటి ఒక కొలత ఉందో లేదో కూడా ఆయనకు సరిగ్గా తెలియదు. నిశ్శబ్ధంలో సమయం వెళ్తోంది. స్వామివారే దానికి జవాబు చెబుతూ, "దాన్ని కూపె(coopay) అని అంటారు. అవును కదా?" అని చెప్పారు.

ఆరోజుల్లో రామేశ్వరం నుండి చెన్నైకి ఉన్న ఒకేఒక్క ట్రైను బోట్ మైయిల్. శర్మగారు ఆరాత్రికే ట్రైనెక్కారు. ఆ విషయాన్ని ధృవీకరించుకునే దాకా వారికి నిద్రపట్టేట్టు లేదు. మరుసటి రోజు ఉదయం తన నివాసానికి వెళ్ళగానే ఆర్కిటెక్ట్ పదాల డిక్షనరీని తీసి దీనికోసం వెతకగా చూపుడువేలు నుండి బొటనవేలు మధ్య దూరాన్ని 'కూపె'గా చెప్పబడింది.

శర్మగారు తన స్నేహితుడైన ఇంజనీయరు మణికి ఫోనుచేసి, "మణి మీ స్వామివారికి.. నా నమస్కారములు.." అని చెప్పాడు.

-- శ్రీ యన్. సుబ్రమణియం B.E., M.Sc., (Engg..), M.I.E., M.I.C.I - చెన్నై

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం।
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం ॥

# 21. ఉపవాసం – భిక్ష

పరమాచార్య స్వామివారు తరచుగా శుద్ధఉపవాసం చేసేవారు. అది ఒక్కొక్కసారి కొన్ని రోజులతరబడి చేసేవారు. వారు భిక్షచేసిన రోజులలో కూడా చంద్రమౌళీశ్వరునికి లేదా కామాక్షికి నైవేద్యం చేసిన కొద్ది పేలాలు మాత్రమే స్వీకరించేవారు. కూరలతో పాటు వండిన అన్నాన్ని తినడం చాలా చాలా అరుదు. అన్నాన్ని పూర్తిగా మానడానికి పచ్చి అరటిపళ్ళతో చేసిన పిండి పదార్థాన్ని తినడం ప్రయత్నించారు కాని భక్తులైన డాక్టర్ల మాటని మన్నించి మానుకున్నారు.

మహాస్వామివారు 1936లో వారణాసి నుండి తిరిగొస్తూ బెర్హాంపూర్ లో చాతుర్మాస్యం చేస్తున్నారు. అప్పుడు స్వామివారి చాలారోజులపాటు శుద్ధ ఉపవాసం చేశారు. అది కూడా వారు మఠం సిబ్బందికి తెలియకుండా చాలా రహస్యంగా చేశారు. ఎలాగో ట్రెజరర్ రామచంద్ర అయ్యర్ గారికి విషయం తెలిసింది.

ఆయన స్వామివద్దకు వెళ్ళి ఉపవాసం విరమించవలసిందిగా ప్రార్థించారు. వెంటనే పరమాచార్య స్వామివారు భిక్షసేవకుణ్ణి పిలిచి రేపటి నుండి తమ ఆహారంలో చేర్చవలసిన వాటి గురించి సెలవిచ్చారు. ట్రెజరర్ చాలా ఆనందపడ్డారు. అతను తన కార్యాలయంలోకి రాగానే అతనికి అనుమానం వచ్చింది. ఈ విషయంలో 'అన్నదాన శివన్' లాంటి వాళ్ళే

బ్రతిమాలినా వినని స్వామివారు నిజంగా తన ప్రార్థన మన్నించారా అని. భిక్షసేవకుణ్ణి పిలిచి అడగగా తన అనుమానం నిజమని తెలిసింది. "మీరు అక్కడనుండి వెళ్ళగానే స్వామివారు నాతో అదంతా మిమ్మల్ని సంతోషపెట్టడానికి చెప్పినది కావున పట్టించుకోవద్దని తెలిపారు" అని చెప్పాడు.

ట్రెజరర్ మళ్ళా స్వామివారివద్దకు వెళ్ళాడు మాట్లాడడానికి. అలా ప్రయత్నించిన ప్రతిసారి స్వామివారు వారి దగ్గరున్న వారితో మాట్లాడుతూ కనిపిస్తున్నారు. ఇలా కొన్నిరోజులు జరిగింది. చివరకు ఒకరోజు రాత్రి పదిగంటలప్పుడు స్వామిని పట్టుకోగలిగాడు. శుక్రవార పూజ అనంతరం చాలా అలసిపోయి కనిపించారు స్వామివారు.

"రేపు మహాస్వామివారు కడుపునిండుగా భిక్ష స్వీకరించాలి" అని చెప్పారు.

స్వామివారి ఓహో అలాగా అన్నట్టు చూసారు. ఆ చూపులను అర్థం చేసుకున్న ట్రెజరర్ "అలాకాని పక్షంలో నేను మఠం వదిలి వెళ్ళిపోతాను" అని చెప్పాడు.

ఆ బెదిరింపు ఏమి పనిచేయలేదు. మహాస్వామి వారు నవ్వి "నువ్వు ఇక్కడ లేకపోతే మఠం ముందుకు వెళ్ళదనుకుంటున్నావా?" అని అడిగారు.

కళ్ళ నీరు కారుస్తూ తీవ్రమైన స్వరంతో,"అలాగైతే నేను ఈ ప్రపంచాన్నే వదిలిపెడతాను" అని అన్నాడు. ఇలా అన్న తరువాత స్వామివారు మరలా అదే ప్రశ్న వెయ్యరు అనే నమ్మకంతో.

***"సరే నేను భిక్ష చేస్తాను. రేపటి దాకా ఎందుకు ఇప్పుడే చేస్తాను. నా కడుపు నిండేటట్టు పెడతాను అన్నావుగా! పెట్టగలవా?" అని అడిగారు.***

"ఈ మాటల కోసమే నేను ఎదురుచూస్తున్నది" అని కళ్ళ నీరుకారుతుండగా స్వామికి సాష్టాంగం చేసాడు. రాత్రి కాబట్టి స్వామివారు పళ్ళు, పాలు తప్ప ఏమి తీసుకోరు తనకు ఎంత ఇవ్వాలో తెలియదు కనుక భిక్ష సేవకుణ్ణి పిలవబోయాడు.

"అతణ్ణి ఎందుకు పిలుస్తున్నావు? నేను భిక్ష అడిగింది నిన్ను. నువ్వు ఇస్తానని ఒప్పుకున్నావు కూడా"

"నాకు ఎంత ఇవ్వాలో తెలియదు కాబట్టి అతణ్ణి అడుగుదామనుకున్నాను"

"అయితే ఏంటి? ఏముందో అది తీసుకునిరా" అని చెప్పారు.

**అక్కడ ఉన్న మొత్తం బుట్టలు, వెదురు పళ్ళాలలో ఉన్న పళ్ళను తీసుకొచ్చాడు ట్రెజరర్. వారికి ఏం కావాలో స్వామివారే తీసుకుంటారు అని అనుకున్నాడు. స్వామివారినుండి అనూహ్యమైన ఆజ్ఞ వచ్చింది.**

“శుక్రవార పూజలో నివేదించిన సొజ్జి(రవ్వకేసరి) సుండల్(గుగ్గిళ్ళు) ఎక్కడ? అవి కూడా తీసుకునిరా!”

ట్రెజరర్ పరిగెత్తుకుని వెళ్ళి పెద్దపెద్ద పాత్రలలో ఉన్న ఆ వంటకాలను కూడా తెచ్చి స్వామివారి ముందు ఉంచాడు. మహాస్వామివారు త్వరగా వాటినన్నింటిని ఖాళీ చేసి ఇంకా కావాలని అడిగారు. ట్రెజరర్ పళ్ళబుట్టలను స్వామివారి ముందుకు జరిపాడు. అవికూడా ఖాళీ అయ్యాయి. “ఇంకా ఏమి ఉన్నాయి?” అని అడిగారు స్వామివారు. ట్రెజరర్ ఆశ్చర్యపోయారు.

**“నాకు కడుపునిండుగా పెడతాను అని చెప్పి నాలో ఉన్న ఆకలిని మేల్కొలిపావు. ఇప్పుడు నేను దాన్ని తట్టుకోలేకపోతున్నాను” అని స్వామివారు చెప్పారు. ట్రెజరర్ ఆ మాటలను విని తట్టుకోలేక ఒక పెద్ద కూజాలో పాలను తీసుకునివచ్చాడు. స్వామివారు ఆ మొత్తం పాలను కూడా తాగారు. వెంటనే ట్రెజరర్ గట్టిగా లెంపలేసుకుంటూ స్వామివారి పాదాలపై పడి, “పెరియవ నన్ను మన్నించాలి. ఇంక నేను మిమ్మల్ని ఇబ్బంది పెట్టను” అని వేడుకున్నాడు.**

స్వామివారు చిన్నపిల్లాడిలానవ్వుతూ, “**అయితే ఇకనామర్గానికి అడ్డురావన్నమాట**” **అని చెయ్యెత్తి ట్రెజరర్ ని ఆశీర్వదించారు**.

-- రా. గణపతి, మహా పెరియవల్ విరుంధు నుండి

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం।
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం ॥

# 22. మహాస్వామివారి "దృష్టి"

సాక్షాత్తు పరమేశ్వరుడే శుకబ్రహ్మ ఋషి జ్ఞానంతో శ్రీశ్రీశ్రీ చన్ద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామివారిగా అవతరించారు. మహాస్వామివారి నిజస్వరూపాన్ని అర్థం చేసుకున్న ఎందరో భక్తులు వారిఆశీస్సులను అందుకున్నారు. మహాస్వామివారి కరుణాదృష్టి ఎంతటి అద్భుతాలను చేస్తుందో ఈ సంఘటన వల్ల మనకు తెలుస్తుంది.

ఒకసారి శ్రీ జయేంద్ర సరస్వతి స్వామివారు తిరుమల శ్రీ వేంకటేశ్వరుణ్ణి, తిరుపతి శ్రీ గోవిందరాజ స్వామివారిని దర్శించుకోవలసి ఉంది. జయేంద్రసరస్వతీస్వామివారు అమరవనేశ్వరన్ ను వ్యానులో కాంచీపురం వెళ్లి మఠం మేనేజరును, ప్రతినిధిని మరియు కొందరు శ్రీమఠం వ్యక్తులను పిలుచుకుని పరమాచార్య స్వామివారి అనుమతి తీసుకునిరమ్మని పంపారు.

నారాయణన్ వ్యాను నడపగా, అమరవనేశ్వరన్ కంచికి బయలుదేరాడు. మహాస్వామి వారిని కలిసి జయేంద్ర సరస్వతి స్వామి అభ్యర్థనను స్వామివారికి తెలిపాడు. శ్రీమఠం నుండి ముప్వురు అమరవనేశ్వరన్ తో కలిసి తిరుపతి వెళ్ళడానికి అనుమతిచ్చారు స్వామివారు. వారు తిరుపతికి వెళ్తున్న మెటోడోరు వ్యానులో వెనుక వైపు పూజా సామాగ్రి ఉన్న పెట్టే ఉంచారు.

అమరవనేశ్వరన్ అలసిపోవడం వల్ల కాస్త నిద్ర రావడంతో, వ్యాను చివరి సీటులో వెళ్లి పడుకున్నాడు. అతను లేచేటప్పటికి తాను ఆసుపత్రిలో ఉన్నట్టు, తలపై కుట్లు వేసినట్టు అర్థం చేసుకున్నాడు. శరీరం మొత్తం చాలా నెప్పిగా అనిపించడంతో మరలా స్పృహ కోల్పోయాడు. స్పృహ వచ్చినతరువాత, మహాస్వామి వారి ఎదురుగా తనని వ్యాను నుండి బయటకు తీయడం, స్వామివారు ఎంతో ఆత్రుతతో ఏమి జరిగింది, ఎవరెవరికి దెబ్బలు తగిలాయి అని అడగడం జ్ఞప్తికి వచ్చింది. అమరవనేశ్వరన్ కు ఇవన్నీ ఎదో కలలో జరిగినట్టు, నిజంగా ఏం జరిగిందో తెలియనట్టు అనిపిస్తోంది.

మొత్తంగా స్పృహలోకి వచ్చాక, తను ఒక ఆసుపత్రిలో ఒళ్ళంతా బ్యాండేజితో ఉన్నట్టు తెలిసింది. అరక్కోణం దగ్గర వ్యానుకు ప్రమాదం జరిగిందని అక్కడున్నవారు చెప్పారు. మహాస్వామి వారి అనుగ్రహం వల్ల అందరూ ప్రాణాలతో బయటపడ్డారు కాని బాగా దెబ్బలు తగిలాయి. అమరవనేశ్వరన్ వ్యాను చివరి సీట్లో ఉండడంవల్ల ఎక్కువగా

దెబ్బలు తగిలాయి. ప్రమాదం జరిగిన చోట ఉన్నవారు అందరిని ప్రభుత్వ ఆసుపత్రికి తరలించగా అక్కడ వారికి ప్రథమ చికిత్స చేసి, మరొక వాహనంలో కాంచీపురానికి తీసుకునివచ్చారు.

ప్రమాదం జరిగిందని, వారిని కంచి శ్రీమఠానికి తీసుకుని వస్తున్నారని మహాస్వామివారికి తెలియగానే, అంత వయస్సులోనూ వంద అడుగుల దూరం నడచివచ్చి, వ్యాను నిలబడే స్థలం వద్దకు వచ్చి వేచియున్నారు. శ్రీమఠం మేనేజరు భార్య కళ్ళ నీరు పెట్టుకుని, ప్రమాదంలో గాయపడ్డవారందరినీ పరమాచార్య స్వామివారే కాపాడాలని ప్రార్థిస్తోంది. స్వామివారు ఆమెతో, **"దిగులు పడకు. వ్యానులో ఉన్న అందరూ పెద్ద ప్రమాదం నుండి తప్పించుకున్నారు"** అని తెలిపారు. వ్యాను రాగానే, మహాస్వామివారు ప్రతిఒక్కరి క్షేమం అడిగి తెలుసుకుని, చికిత్స కోసం వెంటనే వారిని మిషన్ ఆసుపత్రిలో చేర్పించమని అధికారులను ఆదేశించారు.

అమరవనేశ్వరన్ ప్రమాదంలో ఎక్కువగా గాయపడ్డాడు. ఎడమవైపు భాగం చాలా దెబ్బ తిన్నది. ఎడమవైపు ముఖం బాగా వాచిపోయింది. తలలో, ఎడమ నుదురుపై పెద్ద పెద్ద దెబ్బలు తగిలాయి. అరక్కోణంలో ప్రథమ చికిత్స చేసినా, తన ఎడమవైపు శరీరంలో స్పందన లేదని గ్రహించాడు. కాళ్ళు చేతులు కూడా కదపలేకపోతున్నాడు.

అతనికితగిలిన దెబ్బల ప్రభావాన్ని డాక్టర్లుకూడా సరిగ్గా అంచనా వెయ్యలేకపోతున్నారు. కొంతమంది అతను ఇక నడవలేడని అంటున్నారు. బహుశా వెన్నముకకు దెబ్బ తగిలడం వల్ల అతను కాళ్ళు చేతులు కదిలించలేకపోతున్నాడేమో అని డాక్టర్లు అనుమానిస్తున్నారు. అమరవనేశ్వరన్ పరిస్థితి చూసిన డాక్టర్లు అతను బహుశా కోమాలోకి వెళ్తాడు లేదంటే ఒకవైపు చచ్చుబడిపోతుందేమో అని భయపడుతున్నారు.

మరుసటిరోజు ఉదయం అమరవనేశ్వరన్ స్పృహలోకి రాగానే, తను ఈ శరీరాన్ని వదిలివేస్తాడేమోనని చాలా బాధపడ్డాడు. తన దురదృష్టానికి చింతిస్తున్నాడు. వైద్యనాథ స్వామి అయిన పరమాచార్య స్వామివారి శిష్యుడైన అమరవనేశ్వరన్ తనకుతానే ఓదార్చుకుని తనను మహాస్వామివారి వద్దకు తీసుకునివెళ్ళమని బంధువులను, స్నేహితులను కోరాడు. అతని పరిస్థితిని, దెబ్బలను చూసి వారు అతణ్ణి ఆసుపత్రి నుండి బయటకు తీసుకునివెళ్ళడానికి భయపడ్డారు. కాని అమరవనేశ్వరన్ నిర్ణయంలో మార్పు

లేకపోవడంతో, అతణ్ణి శ్రీమఠానికి తీసుకునివచ్చి హాలులో పడుకోబెట్టారు. పరమాచార్య స్వామివారు అతణ్ణి చూడడానికి వచ్చి ఎంతో ప్రేమతో, కరుణతో "**ఈ దేహాన్ని వదిలివేస్తానేమో అని అనుకున్నావా?" అని అడిగారు**.

ఉదయం అతను మనస్సులో అనుకున్న మాటే స్వామివారి నోటినుండి రావడం చూసి, అంతటి బాధలో కూడా, అమరవనేశ్వరన్ స్వామివారి మాటలకు ఆశ్చర్యపోయాడు. మహాస్వామివారి కరుణాపూరితమైన మాటలే తన బాధకి, దుఃఖానికి మందు అని తలచాడు. "**దిగులు పడకు, అంతా సర్దుకుంటుంది**" అని అభయం ఇచ్చారు స్వామివారు.

మరలా సాయంత్రం అమరవనేశ్వరన్ ను శ్రీమఠానికి తీసుకునివచ్చి పరమాచార్య స్వామివారి ఎదురుగా పడుకోబెట్టారు. అమరవనేశ్వరన్ ని తీసుకుని వచ్చిన వారిని అతని ఆరోగ్యం గురించి అడిగారు. "మీరు మోసుకునే వచ్చారా? అతను నడవలేడా? సరేకొద్దిసేపు ఇక్కడే పడుకోబెట్టండి" అని అడిగారు స్వామివారు. స్వామివారు అమరవనేశ్వరన్ ని కాసేపు ప్రేమగా చూసి ఆశీర్వదించారు. పది నిముషాల తరువాత అతణ్ణి పక్కన ఉన్న గదిలోకి తీసుకునివెళ్ళి పడుకోబెట్టమని చెప్పారు.

మరుసటి రోజు **ఒకఅద్భుతంజరిగింది**. దాదాపుగా చలనం లేని అమరవనేశ్వరన్ ఎడమ భాగంలో కొద్దిగా మార్పు కనబడసాగింది. అతి కష్టంతో కాళ్ళుచేతులు కదపగలుగుతున్నాడు. సాయంత్రం స్వామివారి దర్శనానికి తీసుకునివెళ్ళేవాళ్ళు రాకపోవడంతో, అమరవనేశ్వరన్ తనంత తానే లేచి నిలబడి, చేతులతో గోడను పట్టుకుని స్వామివారు కూర్చున్న చోటుకు వచ్చి కూర్చున్నాడు. అలా తనే లేచి నడవడం తనకు ఆశ్చర్యం కలిగించింది.ఇంతటి అద్భుతాన్ని చేసిన సాక్షాత్ వైద్యనాథుడైన మహాస్వామివారు ఏమీ ఎరుగనట్టు అమాయకంగా, "నీ అంతట నీవే నడవగలుగుతున్నావా? మంచి పురోగతి" అని అడిగారు. ఇంకా ఎక్కడెక్కడ నెప్పిగా ఉందని అమరవనేశ్వరన్ ని అడిగి లోపలకు వెళ్లి పడుకోమని చెప్పారు స్వామివారు.

నాలుగు రోజులపాటు అమరవనేశ్వరన్ స్వామివారి దర్శన అనుగ్రహ ఆశీస్సులను పొందాడు. క్రమంగా మొహంవాపుతగ్గిపోయింది, చూపు మెరుగయ్యింది. అమరవనేశ్వరన్ కోలుకోవడం ఇతరులకు స్పష్టంగా కనబడుతోంది. ముక్కులో చీలిక మానిపోయింది. స్కానింగుకని అమరవనేశ్వరన్ ను చెన్నై తీసుకునివెళ్తే, అక్కడి వైద్యులు అమరవనేశ్వరన్ ను

చూసి, “చూస్తుంటే చాలాఆరోగ్యంగా కనబడుతున్నాడు. అమరవనేశ్వరన్ కు స్కానింగు అవసరం ఏముంది?” అని అన్నారు. ప్రమాదం తరువాత డాక్టర్లు ఇచ్చిన రిపోర్ట్స్ చూసి **అంతటి ప్రమాదానికి గురైన వ్యక్తి ఇంత త్వరగా కోలుకోవడం ఆసాధ్యం అని అన్నారు**. అటువంటి ప్రమాదం నుండి బయటపడడానికి కనీసం నాలుగు నెలలు పడుతుందని వారి అభిప్రాయం.

స్వామివారిపై అత్యంతభక్తితో కృతజ్ఞతతో నాలుగు రోజులపాటు స్వామివారు తనని ఎలా అనుగ్రహించారో తెలిపాడు అమరవనేశ్వరన్. అందుకు ఆ వైద్యుడు, “మామూలుగా మేము రోగికి చికిత్స చేసి, అది సఫలం అవ్వడానికి మహాస్వామివారి ఆశీస్సులను కోరుతాము. కాని నీ విషయంలో సాక్షాత్వైద్యనాథుని అవతారమైన పరమాచార్య స్వామివారే చికిత్స చేసిన తరువాత మాలాంటి కేవల వైద్యుల అవసరం నీకు లేదు” అని తెలిపారు.

**అమరవనేశ్వరన్ సంపూర్ణ విశ్వాసంతో స్వామివారికి శరణాగతి చేశాడు కాబట్టి, స్వామివారి అనుగ్రహ ఆశీస్సులతో అంత త్వరగా కోలుకున్నాడు**.

-- “శ్రీ శ్రీ శ్రీ మహాపెరియవా మహిమై” పత్రిక నుండి

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం।
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం ॥

# 23. మర్కటం - మాటలు

వేసవి కాలంలోని ఒక సాయింత్రం. పరమాచార్య స్వామివారు మేనాలో కూర్చుని భక్తులకుదర్శనంఇస్తున్నారు.స్వామివారిదర్శనానికిచాలామందివచ్చారు.భక్తులుసమర్పించిన పళ్ళబుట్టలు,ఎండుద్రాక్ష,కలకండ, తేనె సీసాలు మొదలైనవన్నీ మేనా ముందు నేలపైన ఉన్నాయి.

హఠాత్తుగా కోతులదండు ఒకటి దాడికి దిగింది. పళ్ళని తిని మొత్తం చిందరవందర చేసి తేనెసీసాలను తోసి కిష్కింద చేస్తున్నాయి. అవి మహాస్వామి వద్దకు వెళ్ళి వారికి హాని చేస్తాయి అని శిష్యులు భయపడ్డారు.

కాని మహాస్వామివారి ముఖపద్మంలో రేఖామాత్రమైనా విరక్తి లేదు. వాటిని ఏమీ చెయ్యవద్దని చేతి సైగలద్వారా ఆజ్ఞాపించారు. స్వామివారిని కాపాడుకోవాలని చేతులలో కర్రలు పట్టుకుని వస్తున్నవారల్లా ఆ కర్రల్లాగే స్థాణువులై నిలబడిపోయారు.

కొద్దిసేపటి తరువాత ఆ కోతులన్నీ వచ్చిన పని ముగించుకుని రామకార్యార్థమై వెళ్ళిపోయాయి. అవి వెళ్ళగానే స్వామివారు భక్తులకి ఒక సంఘటనను చెప్పారు.

తంజావూరు జిల్లాలో ఒకగ్రామంలోని ప్రజలు ఈ కోతులబాధ భరించలేకపోయేవారు. అనుకోకుండా దొరికిన ఒక కోతిని ఒకతను కర్రతో కొట్టాడు. దానికి తగిలిన దెబ్బలవల్ల అది కొన్ని రోజులకి మరణించింది. తరువాత తనకి కలిగిన ఆడపిల్లకి మాటలు సరిగ్గా వచ్చేవి కాదు. ఆపిల్లకి వివాహం చెయ్యవలసిన వయసు వచ్చింది. అతను మహాస్వామివారి వద్దకు వచ్చి అతను చేసిన పాపాన్ని చెప్పుకుని బాధపడ్డాడు.

“మట్టితో కోతిబొమ్మను తయారుచేసి మీఊరి గ్రామదేవతగుళ్ళో ఇవ్వు. మనఃస్ఫూర్తిగా ఒప్పుకున్న వాడికే మీఅమ్మాయిని ఇచ్చి పెళ్ళి చెయ్యి” అని చెప్పారు. స్వామివారు చెప్పినట్లే జరిగింది. తరువాత ఆ అమ్మాయికి చక్కగా మాట్లాడగలిగే పిల్లలు పుట్టారు.

**కోతులను ఎప్పుడు కొట్టరాదు. వాటి మీద జాలి చూపించాలి. అవి రాముణ్ణి సేవించుకున్న కోతుల పరంపరలో నుండి వచ్చాయి. అవి మనకు ఇబ్బంది కలిగించినా ‘ఆంజనేయుడు’ అని తలచి వాటిని వదిలిపెట్టాలి.**

ఈకథనంతా వినిభక్తులుకరిగిపోయారు.పరమాచార్యస్వామివారే బోధించినందుకు ఆనందపడ్డారు.

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం।
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం ॥

# 24. ముందస్తు హెచ్చరిక

ఒక ముసలాయన పరమాచార్య స్వామి వారికి సాష్టాంగం చేసి చేతులుకట్టుకుని ఆందోళనగా నిలబడ్డాడు. "అతణ్ణి ఏమి కావాలో అడుగు" అని పక్కన ఉన్న శిష్యుడితో అన్నారు పరమాచార్య స్వామివారు.

ఆ శిష్యుడు అతణ్ణి వెళ్ళి అడిగాడు.

"తరచుగాకలలోయముడు,ఆయనవాహనమైనదున్నపోతుదర్శనం కలుగుతోంది. నాకు చాలా భయంగా ఉంది" అని చెప్పాడు.

అందుకు మహాస్వామి వారు***, "ఇది నీకు ముందస్తు హెచ్చరిక. నీ జీవితం తొందరలో ఇక ముగియబోతోంది అని దీని అర్థం. ఇప్పటి నుండి అయినా కొంచం పుణ్యకర్మ ఆచరించు. మంచి జరుగుతుంది"*** అని చెప్పారు.

"ఇప్పుడు నేనేం చెయ్యాలి?"

**"ధర్మం ఆచరించు. పదిమందికి ఉపయోగపడే పనులు చెయ్యి. ఏదైనా క్షేత్రంలో పాలిచ్చే గేదెను ఇవ్వు. శివాలయాలు దర్శించు. నిత్య కర్మ, పారాయణలు, వ్రతములు చెయ్యి. . . "**

అతని ఆందోళన తొలగి పోయి మనసు తేలికపడింది. "నాకు పరమేశ్వరుడే కర్తవ్యాన్ని బోధించాడు" అని అక్కడున్న శిష్యులతో చెప్పాడు.

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం।
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం ॥

# 25. ఎప్పటికీ మరచిపోని సంఘటనలు

ఒకసారి పరమాచార్యస్వామివారు పండరీపురంలో నది అటువైపున మకాం చేస్తున్నారు. మేము అక్కడకు చేరుకునేటప్పటికి రాత్రి ఎనిమిది గంటలు అయ్యింది. పడవవాడు ఒకడు మమ్మల్ని అటువైపు తీసుకునివెళ్తానని చెప్పి తీసుకునివెళ్లాడు. తనకి మేము డబ్బులు ఇవ్వబోతే, "మహాస్వామివారి దర్శనానికి వచ్చిన వారివద్ద డబ్బులు తీసుకోనని" తెలిపాడు ఆ పేద మరాఠీ పడవవాడు.

అక్కడ ఎన్నో తులసిఆకుల దళాలు దొరుకుతాయి. అరటి చెట్టుబెరడు నుండి తీసిన దారంతో వాటిని మాలగా కట్టి స్వామివారికి స్వామివారికి సమర్పించి, పక్కన నిలబడ్డాము. దాన్ని కనీసం స్వామివారు చూడను కూడా చూడలేదని నాకు చాలాబాధ కలిగింది. ఒక గంటసమయం గడిచింది. ఒక మరాఠీ వ్యక్తి ఒక విగ్రహాన్ని తీసుకునివచ్చాడు. "మాభూమి తవ్వుతూ ఉంటే ఈ లక్ష్మీనారాయణవిగ్రహం బయటపడింది" అని తెలిపాడు. స్వామివారు తమ కమండలంలోని నీటితో అ విగ్రహానికి అభిషేకం చేశారు. నేను సమర్పించిన తులసిమాలను వేసి విగ్రహాన్ని ఇంటికి తీసుకునివెళ్ళమని అతనికి ఇచ్చారు. అ విగ్రహం వస్తుందని స్వామివారికి తెలుసు కాబట్టే ఆ మాలను స్వామివారు ధరించలేదు.

కొద్దిసేపటితరువాత పాముకరచిన వ్యక్తిని నలుగురైదుగురు మోసుకుని వచ్చారు. అతను నురగలుకక్కుతూఊపిరితీసుకోవడానికి చాలాఇబ్బంది పడుతున్నాడు. పరమాచార్య స్వామివారు అతనివైపు ఒకసారి చూసి పెద్ద మొత్తంలో విభూతిని ఇచ్చారు. ఒకతను ఆ విభూతిని అతని ఒంటినిండా పూసి, కొద్దిగా నోట్లో వేశాడు. అరగంట తరువాత అతను స్వస్థతను పొంది లేచి తనను మోసుకొచ్చినవారితో కలిసి నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

*** *** ***

ఎవరినైనా అనుగ్రహించాలి అనుకుంటే **స్వామివారు కలలోకూడా వారినిఅనుగ్రహిస్తారు**.మాపెద్దఅన్న ఒకరు పద్దెనిమిదేళ్ళకే చనిపోయాడు. అప్పటికి మా అమ్మగారి వయస్సు కేవలం ముప్పైనాలుగు సంవత్సరాలు. ఈ సంఘటన జరిగిన తరువాత ఆమె ఇతర పిల్లల గురించి పట్టించుకోకుండా ఆత్మహత్యఆలోచనలు చేస్తోంది. స్వామివారు అమ్మకు కలలో కనబడ్డారు. తరువాత మా అమ్మ మనస్సు మార్చుకుని జీవితం సాగించి, మమ్మలనందరినీ పెంచి, పరమాచార్య భక్తిని నూరిపోసింది.

కొన్ని సంవత్సరాల క్రితం మా అమ్మకు జబ్బు చేసింది. స్వామివారి ముందు నేను రోదిస్తున్నట్టుగా నాకు కలవచ్చింది. కొబ్బరి నీటితో నిండిన సగం కొబ్బరి చిప్ప స్వామివారి చేతిలో ఉంది. "చూడు, నీకు నేను మంచికొబ్బరికాయనే ఇచ్చాను" అని అన్నారు స్వామివారు. ఈనాడు మా అమ్మకు ఎనభై ఏళ్ళు.

*** *** ***

1974వ సంవత్సరంలో మా నాన్నగారు నాకు వజ్రాల దుద్దులు చేయించడానికి కొన్ని వజ్రాలను కంసాలి వద్దకు తీసుకుని వెళ్ళారు. ఉదయం ఎనిమిదిగంటలప్పుడు బయటకు వెళ్ళిన వారు రాత్రి తొమ్మిదైనా ఇంటికి తిరిగిరాలేదు. ఇప్పటిలా అప్పుడు ఫోనుల వ్యవస్థ అంతగాలేదు.మాకుఆందోళనఎక్కువకాసాగింది.మాఅమ్మనాతో,"రా! స్వామివారిని వేడుకుందాము" అనిచెప్పింది. నేనుఏడుస్తూ,"పరమాచార్యస్వామివారుతప్ప మనకు ఇక ఎవరున్నారు?" అని వాక్యం పూర్తిచేసేలోపలేగుమ్మంవద్దమానాన్నగారిమొహం కనబడింది. తరువాత వారికి ఎందుకు ఆలస్యమైందో వివరంగా తెలిపారు.

*** *** ***

ఈయన ఒకసన్యాసి,జ్ఞాని కావలసిన దానికంటే ఎక్కువ సంపదను దాచుకోవడం అన్ని సమస్యలకుమూలం అనిచెప్పేవారు. మనంఎప్పుడూ ప్రాపంచికసుఖాలనే కోరుకున్నా, మన అవసరాలను స్వామివారు తీర్చడమే కాకుండా, ఈ అభిప్రాయాన్ని కూడా మనకు తెలుపుతారు.

కలవైలో ఒక భక్తుడు స్వామివారితో, "నాకు ఉద్యోగంలో పదోన్నతి లభించింది. నన్ను వారు 'ఎ' శ్రేణిలో ఉంచారు" అని తెలిపాడు.

"నీ అవసరానికి సరిపడా ఆదాయం వస్తుందా?".

"మాకు కావాల్సినదానికంటే ఎక్కువగానే వస్తుంది పెరియవా"

వెంటనే స్వామివారు నవ్వుతూ, "మరిక పదోన్నతి ఎందుకు?" అని అడిగారు.

*** *** ***

నాభర్తకు కడుపులో ఎడమవైపున నెప్పిగాఉండేది. దానికికారణమేంటో వైద్యులకు అర్థంకాలేదు.విషయాన్ని పరమాచార్య స్వామివారికి తెల్పమని మాఅమ్మకు తెలిపాము.

స్వామివారు మాఅమ్మతో,"దక్షిణామూర్తి సన్నిధిలో ప్రార్థించమనిచెప్పు.శంకరజయంతి రోజున రామేశ్వరంలో ఇద్దరుబ్రాహ్మణులకుఅన్నదానంచెయ్యమనిచెప్పు"అని ఆదేశించారు. మూడేళ్ళపాటు స్వామివారు చెప్పినట్టు చెయ్యగానే కడుపునెప్పి తగ్గి పూర్తిగా వెళ్లిపోయింది. మేము సతారా వెళ్ళినప్పుడు మూడేళ్ళు మీరు చెప్పినట్టుగా చేశాము పెరియవా అని చెప్పాము.ఇకచాలు అనిచెప్పారు స్వామివారు.

*** *** ***

ఒకసారి నా కలలో, నేను మామూలుగా అనుషంపూజ చేసే చిత్రపటం నుండి స్వామివారు బయటకు వచ్చారు. చేతిలో మల్లెపూల మాల ఉంది. శ్రీ జయేంద్రసరస్వతి స్వామివారు ఇంటి ప్రధానద్వారం గుండా లోపలకువచ్చారు. ఆ మాలని వారికి ఇచ్చి నాకు ఇమ్మని చెప్పారు. అప్పటికి మా ఇంట్లో శ్రీ జయేంద్రసరస్వతి స్వామివారి చిత్రపటం ఉండేది కాదు.

*** *** ***

నేను ఒకసారి ఒంటరిగా చెన్నై నుండి బాంబేకు ప్రయాణమయ్యాను. నా పక్క సీటులో ముగ్గురు మగవాళ్ళు ఉన్నారు. రాత్రిపూట దీర్ఘ నిద్రపోవడం నాకు అలవాటు. రాత్రి రెండున్నర అయ్యిందనుకుంటా, హఠాత్తుగా మెలకువ వచ్చింది. ఎలా మెలకువ వచ్చిందో తెలియదు కానిచూస్తేనాతలవద్ద ఒకవ్యక్తినిలబడిఉన్నాడు.లేచి, నా చేతిసంచిని(పరమాచార్య స్వామివారి చిత్రపటం ఉంటుంది) గట్టిగా హత్తుకుని, "ఏమైందినీకు? ఏమికావాలి?" అని అడిగాను. ఏమిలేదు అని చెప్పి తన సీటులోకి వెళ్లి కూర్చున్నాడు. పక్కసీటులో ఉన్న ఆడవారిని నిద్రలేపి, జరిగిన విషయంవారితోచెప్పి, రాత్రంతావారిని మెలకువగా ఉండమని అడిగాను. నా చేతిసంచిలో ఫోటో రూపంలో ఉన్న పరమాచార్యస్వామి వారే ఆ రాత్రప్పుడు నాకు మెలకువ వచ్చేలా చేశారు.

*** *** ***

మేము అప్పుడు ముంబైలోని ములుండ్ ప్రాంతంలో ఉండేవారం. స్వంత ఇంటి కోసం మేము చేసిన శోధన ఒక పుస్తకంగా ప్రచురించవచ్చు. ఒక సందర్భంలో అడ్వాన్సుగా ఇచ్చినసొమ్ముకూడాతిరిగిచ్చారు.మేము కంచి వెళ్ళినప్పుడు ఈ విషయం మహాస్వామివారికి తెలిపాము. సాధారణంగా స్వామివారు ఏదైనావిషయాన్ని పూర్తిగా తెలుసుకోవడానికి ఎన్నో

వివరాలు అడుగుతారు."తరువాతి రైల్వేస్టేషన్ఏది? అక్కడినుండి దోంబివలి ఎంత దూరం? అక్కడంతా అడ్వాన్సు ఇచ్చేపద్ధతేనా? ఇప్పుడు మీరుంటున్న ఇంటికి ఎంత అడ్వాన్సు ఇచ్చారు?"

మేము తిరిగొచ్చిన తరువాత థానేలో స్వంత ఇల్లు దొరికింది.

*** *** ***

మిరాజ్ లో ఒక మరాఠీవ్యక్తి రెండుబుట్టల నిండుగా భక్షణాలను (మధుర పదార్థాలు) సమర్పించాడు. పరమాచార్యస్వామివారు ధ్యానంలోఉన్నారు. కొద్దిసేపటి తరువాత మహాస్వామివారి మాటలు వినబడడంతో నాభర్త లోపలకు తొంగిచూశారు. శ్రీకంఠన్ ని పిలవమని చెప్పారు స్వామివారు. అతను రాగానే, "ఈ పదార్థాలన్నిటినీ అందరికీ పంచు" అని చెప్పారు. రెండు గంటల తరువాత పంపకం అంతా అయ్యిందా అని విచారించారు. చిన్న విషయం కూడా స్వామివారికి గుర్తుఉంటుంది.

సాయింత్రం వచ్చిన ఒక కుటుంబంతో స్వామివారు, "చిన్నప్పుడు ఇల్లు వదిలి వెళ్ళిపోయిన మీ అబ్బాయి, ఇప్పుడు ఎలా ఉన్నాడు?" అని అడిగారు. తరువాత, "నేనేమైనా ఇప్పుడు జోస్యం చెబుతున్నానా?" అని అన్నారు. ఒక నిముషం తరువాత, "మంచి దారిలో వెళ్లి ఉంటే, తప్పక మంచి స్థితిలోనే ఉంటాడు" అన్నారు. ఇల్లు వదిలి వెళ్ళిన తమ కొడుకు బాగా ఉన్నాడని నమ్మకంతో వెళ్ళిపోయారు. జోస్యం చెప్పరాదన్న శ్రీమఠం నియమాన్ని కూడా అతిక్రమించలేదు.

*** *** ***

ఒకసారి నాభర్త కంచీపురానికి వెళ్ళినప్పుడు, ఒకామె ఏడుస్తూ స్వామివారికి విన్నవించుకుంటోంది, "పెరియవ నామాంగల్యాన్ని ఎవరో దొంగిలించారు. నేను చాలా పేదరాలిని" అని. వెంటనే స్వామివారు మఠం సేవకుణ్ణి పిలిచి మఠంనిల్వలో ఉన్న ఒక మాంగల్యాన్ని తీసుకుని రమ్మని చెప్పి, స్వామివారి స్వహస్తాలతో ఆమెకు ఇచ్చి, మెడలో ధరించమన్నారు.

*** *** ***

ఒకసారి పరమాచార్య స్వామివారు తేనంబాక్కం నుండి కాంచీపురానికి నడిచి వచ్చారు. మేము కూడా స్వామివారిని అనుసరించాము. అప్పుడు మాఅమ్మ ఇతరులు నడవని ప్రాంతంలో, పరమాచార్య స్వామివారు కాలుపెట్టిన ఒకప్రదేశంలోని ఇసుకను తీసుకుని నాకు ఇచ్చింది. ఈనాడు మా ఇంట్లో అనుషం పూజప్పుడు ఆఇసుక ఎంతో స్థానాన్ని పొందింది.

*** *** ***

ఇది ఇటీవలే జరిగిన విషయం. కామాక్షి అమ్మవారి కోసం నా చిన్న చెల్లెలు కొంత ధనం పోగుచేసింది. కాని అమ్మవారికి ఏమైనా చెయ్యాలి అన్న కోరిక వాయిదా పడుతూవచ్చింది. ఈ సమయంలో తను ఒక ప్రవచనానికి వెళ్ళింది. వారు చెప్పిన ఒక సంఘటనలో **ఒక వ్యక్తి పరమాచార్య స్వామి రెండు పొట్లాలను చూపించి, ఒకటి మఠానికి ఒకటి కామాక్షి అమ్మవారికి అని చెప్పాడు. అందుకు మహాస్వామివారు, "అంటే రెండూ నాకే అని చెప్పు" అని అన్నారు**.

ఇది విన్న మాచెల్లి కామాక్షి అమ్మవారికోసం పోగుచేసిన ధనాన్ని తీసుకుని పరమాచార్య స్వామివారుపూజించే పంచలోహవిగ్రహానికి పూజాసామగ్రి, అభిషేక సామాగ్రి కొని స్వామివారికి సమర్పించింది. తను మొత్తంకూడబెట్టిన ఆరువందల రూపాయలు మాత్రమే ఖర్చు అయ్యిందట, ఒక్క రూపాయి ఎక్కువా కాదు, తక్కువా కాదు.

*** *** ***

మా అత్తగారికి హృదయ సంబంధ సమస్య రావడంతో ఆమెను ఆసుపత్రి లో చేర్పించాము. నేను, మాఅమ్మ కంచివెళ్లి విషయాన్ని మహాస్వామి వారికి తెలుపగా, స్వామివారు చెయ్యెత్తి ఆశీర్వదించారు. తరువాత మా అత్తయ్య పదిహేడేళ్ళు బ్రతికి డెబ్బైతొమ్మిదవఏట స్వర్గస్తులయ్యారు.

*** *** ***

అత్యవసర పరిస్థితుల్లో స్వామివారు ఎందరికో మానవరూపంలో సహాయం చేశారు. సుదీర్ఘప్రయాణాల్లో సహప్రయాణీకునిగాకూడావస్తారు. ఇప్పటికీ వేల కుటుంబాలు పరమాచార్యస్వామివారివల్లనేబ్రతుకుతున్నాయి. వారు శరీరం వదిలినందుకు కళ్ళ నీరు పెట్టుకున్న వేల మందిలో , సైకిల్ రిక్షా తొక్కే పేదవారు కూడా ఉన్నారు.

**కాంచీపురం కేవలం దేవాలయాలవల్ల ప్రపంచప్రఖ్యాతి పొందలేదు. మన పరమాచార్య స్వామివారు, స్వామివారి యతి వారసులు శ్రీ జయేంద్ర పెరియవా మరియు బాల పెరియవా వల్ల కూడా.**

*** *** ***

చాలా సంవత్సరాల క్రితం మేము శ్రీ జయేంద్ర స్వామివారిని కలిసి, మాకు ఒక బిడ్డ పుట్టి కొద్ది సేపటికే చనిపోయిందని తెలిపాము. స్వామివారు మాకు ప్రసాదం ఇచ్చారు. మరుసటి సంవత్సరం స్వామివారి అవతార నక్షత్రమైన ధనిష్ఠ రోజు మాఅబ్బాయి పుట్టాడు. మ ఇంటి సాంప్రదాయం ప్రకారం ఆ బిడ్డకు ఉన్న పేరు స్వామినాథ శర్మ. మేము పెట్టిన పేరు చంద్రశేఖర్.

*** *** ***

ఒకసారి మా పెద్దన్నయ్య ఆరోగ్యం బాగోలేదు. ఆ విషయంలో నేను ఎక్కువగా కలత చెందినప్పుడు, **శ్రీ జయేంద్ర స్వామివారు కలలో కనబడి, “మీ అన్నకు బాగోలేదా?” అని నవ్వారు.** ఆ మరుసటి దినం నుండే మా అన్నయ్య ఆరోగ్యం మెరుగవ్వడం మొదలైంది. మారోగాల గురించి స్వామివారికి తెలిపిన వెంటనే ఎన్నోమార్లు శ్రీ జయేంద్ర స్వామివారు మాకు ప్రసాదం ఇచ్చారు. ఇలాగే మా అబ్బాయి మూత్రపిండాల్లో ఉన్న రాళ్ళను కూడా పోగొట్టారు. మా అబ్బాయికి నడుము నెప్పి వచ్చి ఆక్యుపంచర్ ద్వారా చికిత్స చెయ్యాలన్న విషయాన్ని స్వామివారికి తెలిపాము. వెంటనే జయేంద్ర స్వామివారు, “**అవన్నీ అవసరం లేదు. ఈ మందును పూయండి అంతా సర్దుకుంటుంది**” అని ఒక చిన్న **అమృతాంజనం** డబ్బా ఇచ్చారు. **సాధారణ జలుబు నివారిణి అయిన మామూలు అమృతాంజనం, శ్రీ జయేంద్రసరస్వతీ స్వామివారి చేతులు తగలడంవల్ల అద్భుతంగా కిడ్నీలో రాళ్ళను పోగొట్టింది.**

--- శ్రీమతి ఇందిరా బాలసుబ్రమణియమ్, పశ్చిమ థానే, ముంబై.

మహా పెరియవాళ్ - దరిశన అనుభవంగళ్ 6

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం

శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం ॥

# 26. పరమాచార్యవారు చూసుకుంటారులే!

నేను, మాచెల్లెలు అవయాంబళ్ చిన్నపిల్లలుగా ఉన్నప్పుడు **ఇలయత్తాంగుడిలో** మొదటిసారి పరమాచార్య స్వామివారినిదర్శించుకోవడమే మాకు గుర్తు. కొన్ని సంవత్సరాల క్రితం తను పూణే వచ్చి, అక్కడి నుండి బాంబేకు మరలా చెన్నైకు వెళ్ళాలని ప్రణాళిక వేసుకుంది. అంతకు ముందురోజే ఒక ప్రముఖరాజకీయనాయకుని భార్య మరణించడంతో మహారాష్ట్ర పరిస్థితిని అదుపులో ఉంచడానికి బంద్ ప్రకటించడంతో బస్సులు, ఆటోలు తిరగడంలేదు. నేను పూణేకు ఫోనుచేసి తన ప్రయాణం వాయిదావేసుకొమ్మని తెలిపాను.చెన్నైలో ఆరోజు తప్పక కార్యాలయానికి వెళ్ళాల్సిఉండడంతో ప్రయాణాన్ని వాయిదావెయ్యలేనని తెలిపింది.“సంఘవ్యతిరేక శక్తుల వల్ల సమస్యగా ఉంది. కొంతమంది వ్యక్తుల ప్రాణాలు కూడా పోయాయి” అని తెలిపాను.

దానికి ఒకే ఒక ముక్కలో, “**అవన్నీ పరమాచార్యస్వామివారు చూసుకుంటారులే**” అని బదులిచ్చింది. ‘ఇది నాకెందుకు స్ఫురించలేదు’ అనుకున్నాన్నేను. మరుసటి రోజు నేను ‘కళ్యాణ్’ కి వెళ్లి తనను తీసుకుని ‘ములంద్’ కు వచ్చాను. మేము బయటకు రాగానే, అంతా కేవలం పోలీసుల తలకాయలు మాత్రమే కనబడుతున్నాయి. పెద్ద ట్రంకుపెట్టె ఒకబ్యాగు మా వద్ద ఉన్నాయి. దాదాపు ఇరవై అయిదు నిముషాలు నడవాలి. ఏం చెయ్యాలో తెలియక అలా నిల్చుని ఉన్నాము.

“అమ్మా,ఇక్కడకుఎందుకువచ్చారు?ఇంటికివెళ్ళాలా?”అన్నమాటలువినబడ్డాయి. తలతిప్పిచూస్తే, ‘వేలు’ కనబడ్డాడు, మా పక్కవీధి లో వార్తాపత్రికలు వేసే అబ్బాయి. ఒకట్రెండుసార్లు అతనితో మాట్లాడాను నేను. అతను ముందుకు వచ్చి, బ్యాగును, ట్రంకు పెట్టెను తీసుకుని తన సైకిలు బుట్టలో ఉంచుకుని మాతోపాటుగా నడుస్తూ ఇంటి దాకా వచ్చాడు.గురుకృపఉంటే అడవిలో పులైనా వచ్చి సహాయం చేస్తుంది.

--- శ్రీమతి ఇందిరా బాలసుబ్రమణియమ్, పశ్చిమ థానే, ముంబై. మహా పెరియవాళ్ - దరిశన అనుభవంగళ్ 6

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం ॥

# 27. మా ఇంటికి రండి..

పరమాచార్య స్వామివారు 1965లో చెన్నైలో మకాం చేస్తున్నారు. స్వామివారిని మా ఇంటికి పిలుచుకుని వచ్చి, వారి చరణకమలాల స్పర్శతో మంగళకరం చెయ్యాలని నాకు చాలా కోరికగా ఉండేది. మైలాపూర్ లోని **శ్రీ కర్పగాంబళ్ కళ్యాణమండపంలో** ఉంటూ భక్తులకు కరుణ, ఆశీస్సులు భక్తకోటికి పంచుతున్నారు మహాస్వామి వారు.

తమిళనాడు ముఖ్యమంత్రి యం. భక్తవత్సలం మరియు వారి కుమార్తె శ్రీమతి సరోజినీ వరదప్పన్ మహాస్వామివారి దర్శనానికి వచ్చారు. ఏడున్నరగంటల నుండి రాత్రి పదకొండున్నర దాకా స్వామివారితో సంభాషించి వెళ్ళిపోయారు. తరువాత నేను మా తల్లితండ్రులతో కలిసి దర్శనానికి వెళ్లి స్వామివారికి సాష్టాంగం చేశాము.

"పరమాచార్య స్వామివారి గురించిన ఆలోచనలతో గత రెండురోజులుగా మాఅబ్బాయి ఉపవాసం ఉన్నాడు. స్వామివారు ఎక్కడికి వెళ్ళినా వెంట వెళ్తున్నాడు. శరీరాన్ని ఎక్కువ కష్టపెడుతున్నాడు. పెరియవా మా ఇంటికి రావడానికి అంగీకరించేదాకా ఇలాగే ఉంటానని పట్టుబట్టాడు. కేవలం స్వామివారేఅనుగ్రహించాలి" అన్నాను. మహాస్వామివారు నావైపు చూశారు.

"నీవు నీతల్లితండ్రులతో కలిసిఇంటికివెళ్ళు.మీకు ముందుగానే తెలిపినేను తరువాత వస్తాను" అని చెప్పారు స్వామివారు.

మరుసటి రోజు ఉదయం ఐదున్నరప్పుడు టెలిఫోను మోగింది. శ్రీమఠం క్యాంపు నుండి శ్రీ వి. వైద్యసుబ్రహ్మణ్య అయ్యర్ మాట్లాడారు. "మిస్టర్ వేంకటరామన్, పరమాచార్య స్వామివారు మీ ఇంటికే బయలుదేరుతున్నారు. మీరు వెంటనే రండి" అని తెలిపారు.

మహాస్వామివారు మేనాలో బయలుదేరి, దారిలో ఉన్న భక్తవత్సలం గారి ఇంటికి వెళ్లి, వారిని ఆశీర్వదించి, దాదాపు ఏడున్నరగంటలప్పుడు మాఇంటికివిచ్చేశారు. అంతేవాసులని, భక్తులని ఇంటి బయటే ఉండమని చెప్పి, మా ముగ్గురిని మాత్రమే మేనా దగ్గరలో కూర్చోబెట్టారు.

"మీరు ముగ్గురు జపం చెయ్యండి. లోపలనేను ధ్యానం చేసుకుంటాను" అని మేనా తలుపులు వేసుకుని ధ్యానంలోకి వెళ్ళారు స్వామివారు.

సరిగ్గా గంట సమయం గడిచింది.

మేనా తలుపులుతెరిచి పరమాచార్యస్వామివారు సాక్షాత్ పరమేశ్వరునిలా దర్శనం ఇచ్చారు. "పెరియవా మమ్మల్ని క్షమించాలి. మా అబ్బాయి శీను స్వామివారిని చాలా ఇబ్బంది పెట్టి ఇంటికి పిలుచుకునివచ్చాడు. మమ్మల్ని క్షమించాలి"

తరువాత మహాస్వామివారి ఆదేశానుసారం మా ఇంటి ఆవరణంలో కట్టిన వినాయక దేవాలయాన్ని వారు దర్శించారు. వినాయకుని చుట్టూ పదిహేనుసార్లు ప్రదక్షిణచేశారు స్వామివారు. వారి పాద స్పర్శతో మా ఇల్లు ఎంతో పవిత్రమైంది .మా మనస్సులు ఎంతో పులకించి పోయాయి .

అప్పుడు నేను స్వామివారి ఫోటో తీయడానికి సంకల్పించి వారిఅనుమతి అడిగాను. కాని నాకు అనుమతి ఇవ్వలేదు. ఇంటి నుండి వెళ్ళిపోయేటప్పుడు ఫోటో తీయడానికి ఎన్ని సార్లు ప్రయత్నించినా కుదరలేదు.

చివరిదాకా ఫోటో తీయడంలో నేను సఫలం కాలేదు. అయితేనేం, మా మనస్సుల్లో ఉన్నారుకదా !!

-- వి. శ్రీనివాసన్, చెన్నై. మహా పెరియవాళ్ - దరిశన అనుభవంగళ్ 2

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం ॥

# 28. వేపపువ్వు పచ్చడిప్రసాదం

తమిళ సంవత్సరాది రోజున పరమాచార్య స్వామివారిని దర్శించుకునే అవకాశం వచ్చింది ఒకసారి. పుదుక్కోట్టై నుండి అక్కడకు వెళ్లి మహాస్వామి వారిని దర్శించుకుని చింతపండు, బెల్లం కలిపిన వేప పువ్వు మిశ్రమాన్ని స్వామివారికి సమర్పించాము.

"వేప పువ్వు పచ్చడిని మీరు ఎలా తయారుచేస్తారు?" అని అడిగారు స్వామివారు.

మాకు తెలిసిన విధానాన్ని తోచిన పదాలతో తెలియజేశాము.

అందుకు మహాస్వామివారు, "ఈ మూడు పదార్థాలు మాత్రమే సరిపోవు. దానికి **మీరు తేనె మరియు నెయ్యి చేర్చాలి**. దాన్ని సరైన పద్ధతిలో చేస్తే పచ్చడి చాలా రుచిగా ఉంటుంది. ఇలా తయారుచేసిన పదార్థాన్ని మీరు ఇతరులకు పంచాలి, వారు మీ వైపు ఆకర్షితులు అవుతారు"

**"మొదట, అమ్మవారికి నైవేద్యంగా సమర్పించాలి, అప్పుడు మీకు అమ్మవారు ప్రసన్నురాలు అవుతుంది. తరువాత మీ ఇంటి యజమానికి, అప్పుడు భార్య ఏమి చెబితే వాటికి ఆయన తల ఊపుతాడు! తరువాత ఇంటిలో పనిచేసే వారికి ఇవ్వాలి. అప్పుడు వారు ఏమాత్రం గొణుక్కోకుండా మీ పనులు చేసి పెడతారు!"**

తరువాత స్వామివారు కొంత వేపపువ్వుపచ్చడి తయారు చెయ్యమని వంటశాలకు ఆదేశాన్ని ఇచ్చారు. దాన్ని తీసుకుని వచ్చి, అందరికి పంచమని చెప్పారు.

"ఇప్పుడు ఇది ఎందుకో తెలుసా?" అని అడిగారు.

అందుకు ఒకామె, "దీంతో మేమందరమూ పరమాచార్య స్వామివారి ఆదేశాల మేరకు నడుచుకుంటాము" అని చెప్పింది.

"అవును నిజమే, కాని ఇది త్రిపురసుందరి ప్రసాదం. మీరందరూ ఎల్లప్పుడూ అమ్మవారికి భక్తురాళ్ళుగా ఉండాలి" అని చెప్పారు.

మా చేతుల్లో ఉన్నది ఒక చెంచాడు వేప పువ్వు పచ్చడిగా అగుపించలేదు, అమృత సముద్రంలా అనిపించింది.

-- రాధా రామమూర్తి, మహా పెరియవాళ్ – దరిశన అనుభవంగళ్ 6

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం!
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం !!

# 29. విశ్వగురువులు

గత కొన్ని సంవత్సరాలుగా నేను, మాకుటుంబం మొత్తం పరమాచార్య స్వామివారి భక్తులం. ఆచార్యులకు, మాకు మధ్యన ఒకదృఢమైన బంధం ఏర్పడిందని నేను ఖచ్చితంగా చెప్పగలను. గత కొద్దినెలలుగా మహాస్వామివారి గురించి ఎందరో ఎన్నో విషయాలను పంచుకున్నారు . స్వామివారి దర్శనానికి కంచి మఠానికి వెళ్ళినప్పుడు నాకుకలిగిన కొన్ని అనుభవాలను, నాపై, నాకుటుంబసభ్యులపై స్వామివారు కురిపించిన అనుగ్రహాన్ని తెలియజేయడానికి ప్రయత్నిస్తాను. అంతటి నిర్మలమైన ,ప్రశాంతమైనమోమును నేను ఎప్పుడూ..ఎక్కడాచూడలేదు. కేవలంకరుణను,ప్రసన్నతనుప్రసరించేమోము అది .. దయను వర్షించే అయస్కాంతం లాంటి ఆ కళ్ళు ఎందరినో ఆదరించడం నన్ను కదిలించివేసింది

ఇటువంటి సందర్భంలో కంచి మఠానికి, ఆచార్యులకు మమ్మల్ని దగ్గర చేసిన ఒకట్రెండు విషయాలను ప్రస్తావించబోతున్నానుఏ సామాజిక విషయాలు .స్వోత్కర్ష గా అనిపించమాట్లాడడానికి అయిష్టపడతానో , అవి నేను సమాజంలో మాట్లాడడానికి అయిష్టపడాలి . అయితే పరమాచార్యస్వామివారు ఏమి చేసినా అది భక్తులను అశీర్వదించడానికే కాబట్టి నేను మాట్లాడాలి.ఇక్కడ చెప్పుకోవాల్సిన మరొక్క విషయం, **ఎవరైనా ఎంతటి కష్టమైన పని అయినా మఠం కోసంచెయ్యాలని తలపెడితే, అందుకు స్వామివారి ఆశీస్సులు పుష్కలంగాలభించి అది అత్యంత త్వరగా,పరిపూర్ణంగా అలౌకికంగా పూర్తవుతుంది**.

చాలా సంవత్సరాలక్రితం భారీవర్షం కురుస్తున్న ఒకరోజు, పూర్తిగా తడిసిపోయిన ఇద్దరువ్యక్తులు కంచిమఠం తరుపున ఒక విషయం నాకు తెలియజేయడానికి కాంచీపురం నుండి వచ్చారని నాకు తెలిపారు. వారిని నేను లోపలకు రమ్మన్నాను. పరమాచార్య స్వామివారు చిదంబర నటరాజస్వామివారికి వజ్రకిరీటం చేయసంకల్పించారని, కాని కొద్దిగా ధనంతక్కువ అవ్వడం వల్ల అది పూర్తి కాలేదనివారు నాకు చెప్పారు. వారు మద్రాసుకువచ్చినపని, కొందరుభక్తులను కలిసి వారివద్దనుండి విరాళాలు సేకరించడానికే. దానికి ఇంకా ఎంత ధనం కావాలో అంతధనం ఇవ్వడానికి నేను సిద్ధమని పరమాచార్య

స్వామివారికి తెల్పమని వెంటనే వారికి చెప్పాను. తరువాత స్వామి వారి దగ్గరకు వెళ్లి, నా మాటను నేరవేర్చాను. మహాస్వామి వారి ఆశీస్సుల వల్ల కిరీటం పని పూర్తయ్యింది. అలాగే మహాస్వామివారికి, మఠానికి మేము మరింత దగ్గరయ్యాము.

దాదాపు మూడు సంవత్సరాలక్రితం ,గల్ఫ్ యుద్ధం జరుగుతున్నసమయంలో మన మాజీ రాష్ట్రపతి శ్రీ ఆర్ .వేంకటరామన్ గారు శ్రీమఠంలో ఉన్నపుడు , అక్కడి వైద్యులు పరమాచార్య వారి ఆరోగ్యస్థితి ని అంచనా వెయ్యటానికి స్వామివారి పూర్తి శరీరం స్కాన్ చెయ్యాలన్న అభిప్రాయాన్ని తెలిపారు . కాని , **మహాస్వామి వారు ఎటువంటి వాహనం ఎక్కరు** కాబట్టి స్కానింగ్ యంత్రాలు ఉండే మద్రాసుకి శ్రీవారిని తీసుకువెళ్లటం కుదరనిపని. దాంతో మొబైల్ స్కానింగ్ మిషన్ ను అమెరికా నుండి తెప్పించాలని రాష్ట్రపతి గారు అభిప్రాయపడ్డారు . ఆయంత్రం కోసం వారు అమెరికా అధ్యక్షులు సీనియర్ బుష్ ను సంప్రదించారు . గల్ఫ్ యుద్ధం కారణంగా అన్ని యంత్రాలను అక్కడకు పంపటంతో భారతదేశానికి పంపలేమని బుష్ తెలిపారు . అదృష్టవశాత్తు ఇతరవ్యక్తుల ద్వారా అమెరికాలోనే ఉన్న ఇంకో యంత్రాన్ని గుర్తించారు **. శ్రీ వెంకటరామన్ మరియు శ్రీ రాజీవ్ గాంధి గార్లు ఆ యంత్రాన్ని కాంచీపురానికి చేర్చే బాధ్యతను నాకు అప్పగించారు.** యంత్రం కాంచిపురానికి సురక్షితంగా వచ్చింది . అత్యాశ్చర్యకరంగా ఆ యంత్రానికి ఎటువంటి హాని కలుగకుండా కాంచిపురానికి రావటం ఒక ఆనందమైతే , ఆ వచ్చిన యంత్రం స్వామివారిని పరీక్షించి , వారి ఆరోగ్యం సరిగ్గా ఉందని తెలుపటం మరింత ఆనందకరం . ఇది నా జీవితంలో మరచిపోలేని అద్భుతమైన అనుభవం.

మరొక్క సంఘటన కూడా చెప్పుకోవాలి. జనవరి 1992 మొదటి వారంలో భారతరాష్ట్రపతి చేతుల మీదుగా ప్రారంభం చెయ్యబోతున్న 'శ్రీ వేంకటేశ్వర ఇంజనీరింగ్ కళాశాల' ఉత్సవం విజయవంతం అవ్వడానికి పరమాచార్య స్వామివారి ఆశీస్సుల కోసం నేను నా భార్య కాంచీపురం వెళ్ళాము. స్వామివారి ఆశీస్సులు తీసుకుని, తిరిగి వెళ్ళడానికి స్వామివారి అనుమతి తీసుకున్న తరువాత నాకు ఒక శాలువా బహూకరించారు. స్వామివారు ఆ శాలువాను చూసి కాస్త నిరాశ పడ్డారు. మమ్మల్ని కొద్దిసేపు వేచి ఉండమని చెప్పారు. స్వామివారు వేసుకున్న శాలువా తీసి, దాన్ని మృదువుగా తలకు రుద్దుకుని, నన్ను తమ పక్కకు పిలిపించుకుని, దాన్ని నాకు ఇవ్వాల్సిందిగా అక్కడున్న సేవకుడిని, దాన్ని నా

భార్యకు ఇవ్వాల్సిందిగా నాకు సైగచేశారు. చెప్పాలంటే మాటల్లో చెప్పలేని పులకింతను పొందాము.

మా అబ్బాయి పెళ్ళికి పది నెలల ముందు మేము కంచి మఠానికి వెళ్ళినప్పుడు మరొక అద్భుతసంఘటన జరిగింది. మేము పరమాచార్యస్వామి వారిని దర్శించుకుంటున్నప్పుడు స్వామివారి అంతేవాసులు మా అబ్బాయి అశ్విన్ వివాహం నిశ్చయమైందని మహాస్వామి వారికి తెలిపారు. తరువాత పెళ్లిపత్రికతో సహా వచ్చి మహాస్వామి వారి ఆశీస్సులు తీసుకుందామని మేము ముందుగానే అనుకుని ఉండడం వల్ల ఆ విషయం స్వామివారితో ప్రస్తావించలేదు. స్వామివారు వెంటనే ఒక కొబ్బరికాయ తీసుకుని రమ్మని తెలిపి, ముందుగానే మాకు ఆశీ:పూర్వకంగా ఇచ్చారు. సాధారణంగా స్వామివారి ఆశీశ్సులను ప్రత్యేకంగా అడిగినప్పుడే ఇలాచేస్తుంటారు. కాని స్వామివారు ఎంతో దివ్యదృష్టితో ఈపని చేశారు. తరువాతమేముస్వామివారిఆశీస్సులను ఇంక మరి పొందలేకపోయాము. ఎందుకంటే, పెళ్ళికి పదిహేనురోజుల ముందరే స్వామివారు బ్రాహ్మీభూతులయ్యారు.స్వామివారు అందుకే మాకు అడగకుండానే అశీస్సులందజేసారు. జరిగిన విషయం తెలుసుకుని శ్రీ శ్రీ జయేంద్ర సరస్వతి స్వామివారు ఆశ్చర్యపోయారు.

ప్రముఖులు, విద్యావేత్త అయిన మా తాతగారు **డా. రాజా సర్అన్నామలై చెట్టియార్** గారి స్ఫూర్తితో తమిళనాడులో కాని పుదుచ్చేరిలో కాని ఒక ఉన్నత విద్యాసంస్థను నెలకొల్పాలని చూస్తున్న తరుణంలో 1998లో నాకు కలిగిన మరొక అనుగ్రహం - శ్రీపెరుంబదూర్ లో ఉన్న శ్రీవేంకటేశ్వర ఇంజనీయరింగ్ కాలేజి యాజమాన్య బాధ్యతలు తీసుకోవాల్సిన అవకాశం దొరకడం. పరమాచార్య స్వామి మరియు వారి ఇద్దరి శిష్యుల అనుగ్రహం వల్ల ఈరోజు **శ్రీ వేంకటేశ్వర ఇంజనీయరింగ్ కాలేజ్** తమిళనాడులో ఉన్న ప్రముఖ కలాశాలలో ముందు వరుసలో ఉన్నది.

1993 మే లో జరగబోయే కనకాభిషేకానికి భక్తుల నుండి బంగారము, ధనము స్వీకరించే ఉపసమితికి అధ్యక్షునిగా నన్ను నియమించడం నాఅదృష్టం. అది చాలా కష్టమైనా బాధ్యతతో కూడుకున్న వ్యవహారం. కాని మహాస్వామి వారి అనుగ్రహం వల్ల వచ్చిన ఉత్సాహం చిన్నదేమీ కాదు. విరాళాలు విరివిగా వచ్చాయి. మొదలుపెట్టిన నాటినుండే ఎటువంటి ఇబ్బంది లేకుండా బంగారం కొనుగోలు, రవాణా అన్నీ సక్రమంగా జరిగాయి.

1993 మే 27న పెద్ద ఎత్తున పరమాచార్య స్వామివారికి కనకాభిషేకం నిర్వహించడంజరిగింది.ఆఅరుదైన ఉత్సవాన్ని తిలకించడానికి భక్తులు తండోపతండాలుగా తరలివచ్చారు.

పరమాచార్యస్వామివారు ఈ శతాబ్దపు మహోన్నత ఆధ్యాత్మిక చక్రవర్తి. స్వామివారి శతాబ్దపు జీవితం ఎన్నో ఉన్నత విషయాలు, అవిరళ కృషి, అద్భుతమైన విజయాల సమాహారం. స్వామివారు ఒక విజ్ఞాన సముద్రం. అంతే కాదు వారు కరుణా సముద్రులు కూడా. ఎన్నో దేశాల వివిధ నాగరికతల, సంప్రదాయాల, పద్ధతులపై ఎంతో లోతైన అవగాహన, పట్టు ఉన్నావారు. హిందూ వారసత్వపు పవిత్రతను కాపాడాలన్నదే వారి చిరకాల కోరిక. దేశ, జాతి, కుల, వర్గ, మత బేధాలు లేని విశ్వగురువు పరమాచార్య స్వామివారు. జనవరి 8 స్వామివారు శరీరం వదిలిన రోజు, స్వామివారిని చివరిసారిగా ప్రేమతో దర్శించుకోడానికి వచ్చిన క్రైస్తవ నన్ లను, మహమ్మదీయ ప్రజలును చూసే దృశ్యం - ఎన్నో లక్షల మందిని కదిలించింది.

-- డా .ముత్తయ్య .సి.ఎ .“kamakoti.org” నుండి

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం!
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం !!

# 30. మహాస్వామి -మానసికదర్శనం

## భావాలు – అనుభవాలు:

జయ జయ శంకర హర హర శంకర!
జయ జయ శంకర హర హర శంకర!!
కాంచి శంకర కామాక్షి శంకర!
కాలడి శంకర కామకోటి శంకర!!

కొద్ది దూరం నుండి జయజయ ధ్వానాలు వినబడుతున్నాయి. మొదట గందరగోళంగా చిన్నగా వినబడింది. దగ్గరకు వెళ్ళేకొద్దీస్పష్టంగా వినబడడంతో, దేహం రోమాంఛితమయ్యింది. చీమల దండులో నిదానంగా నడచి వస్తున్నా భక్తుల యొక్క పెద్ద గుంపు. హంగు, ఆర్భాటాలు, అలంకారాలు, అరుపులు లేక అతి సామాన్యంగా ఉంది. వివిధ జాతుల, వివిధ భాషల, పేద ధనిక, అడ మగ, పిల్లలు అందరూ వారికి వచ్చే భాషలో భజనలు పాడుకుంటూ పదే పదే శ్లోకాలను వల్లెవేస్తూ వెళ్తున్న ఊరేగింపు.

నాలుగ్గంటల సూర్యుని సన్నని లేలేత వెలుగు. సూర్యుడు దాగుడుమూతలు ఆడుతున్నాడా అన్నట్టుగా, అక్కడక్కడా మబ్బుల్లో దాగుతున్నాడు. గుంపు మధ్యలో ఒక చిన్న సైకిల్ రిక్షా. అది చూడడానికి సర్కస్సులో వాడేదిగా ఉన్నట్టు ఉంది. దానిపై చిరిగిన గోనెసంచులు, ఒక చాప, ఆకులతో అల్లిన గొడుగు, కొన్ని సరుకులు.

ఒకరు ఆ రిక్షాను లాగుతూ ఉంటే, దాని వెనుక రిక్షాను పట్టుకుని నీవు (రచయిత్రి స్వామివారిని ఇలాగే సంబోధిస్తోంది). చూసిన మరుక్షణమే చేతులు కాళ్ళు వణుకుతుండగా, రోడ్డుపై పడి నమస్కారం చేస్తాము. నువ్వు ఆగవు కాని కళ్ళతోనే మమ్మల్ని ఆశీర్వదించి ముందుకు సాగుతావు. అవి నీ కళ్ళా? కాదు, కాదు! కరుణా సముద్రాలు.

నీ దర్శనంకోసం,నిన్ను చూచేభాగ్యంకోసం ఎన్నోసంవత్సరాలు ఎదురుచూశాను. నీ గురించి చదివినా, విన్నా మనస్సు ఎంతో ఆతృత పడేది. ఏ పత్రిక కొన్నా నీ గురించి ఏమి వ్రాశారో అని వెతికేవి నా కళ్ళు. నిన్ను చూడలేనేమో అన్న దిగులు పట్టుకుంది. అప్పుడు నువ్వు కంచికి దగ్గరలోనే ఉన్నావు. మేము లెక్కలేనన్నిసార్లు మద్రాసుకు వచ్చాము. కంచికి వచ్చి నిన్ను ఒక్కసారైనా చూడాలని ఎన్ని సార్లు అర్థించానో. వేడుకున్నాను. <u>మేము చాలా</u>

సామాన్యులం. పనికిరానివాళ్ళం. ఆహారము, నిద్ర, అవసరం లేని ఆడంబరము, పనికిమాలిన విషయాలే గొప్పవి అనుకునేవాళ్ళం. ఎక్కడికి వెళ్ళాలి అనిపిస్తే అక్కడికి వెళ్తాము, ఎంత ఖర్చు పెట్టాలి అనిపిస్తే అంత ఖర్చు పెడతాము, కాని నిన్ను చూడటానికి రావడానికి మాత్రం మాకు కుదరదు.

రోజూ దీపం వెలిగించి నీ చిత్రపటాన్ని చూడగానే, మనస్సంతా దిగులుగా అయిపోయేది. మానవ ప్రయత్నం వల్ల నిన్ను చూడటం సాధ్యం కాదని, కేవలం నీవు పిలిస్తేనే అది కుదురుతుంది అని. నా కోరికను మాటల్లో ఎప్పుడూ చెప్పలేదు. నీకు అది వినబడిందా? ఏమైతేనేమి, బిడ్డకు ఆకలి వేస్తే ఆకలి అని ఏడ్చాల్సిన అవసరం లేదు. తల్లి ఆ ఆకలిని అర్థం చేసుకోగలుగుతుంది. అలాగే, నా బాధ కూడా నీకు అర్థం అయ్యుంటుంది.

నేను నిన్ను చూడలేకపోతున్నాననే బాధ వల్ల నీవే నన్ను చూడటానికి వస్తున్నావా? **నీకు ఏముంది? కారా? రైలా? ఈ తారు రోడ్డుపై కాళ్ళు మంటలు పుట్టగా నడిచి వస్తావు. ఆ కాళ్ళకు వేసుకున్నదేమో విరిగిపోయిన చెక్క పాదుకలు, అదికూడా మంజి నారుతో కట్టినవి**.

అదేమైనా ఒక మైలా, రెండు మైళ్ళా? ఎంత దూరం నడిచావు అప్పా! వేలమైళ్ళు కేవలం కాలినడకన వచ్చావు. మేము నివసిస్తున్న ఈ హుబ్లి నగరం ఎంత పుణ్యం చేసుకుందో కదా నీ పాదస్పర్శ పొందడానికి. నీవు వస్తావని మేము కలలో కూడా ఊహించలేదు. కాని నువ్వు రావడం నిజమే. చిరిగినా కాషాయ వస్త్రం, దానిపైన చెట్టు బెరడు నారతో చేసిన ఒక ఆచ్ఛాదన. మెడలో, తలపై రుద్రాక్ష మాలలు. నిన్ను చూడగానే ఒక క్షణకాలం సందేహం. మానవుడేనా? కాదు, కాదు. పులి చర్మం ధరించి నడుస్తున్న పరమేశ్వరుడు. భగవంతుని దర్శనం చేసుకున్నామన్న సంతృప్తి. మాకు నువ్వు కాదు శివుడు కనబడుతున్నాడు.ఆశ్రమ ధర్మం కోసం ఆరోజు నువ్వు అన్నిసార్లు స్నానం చేశావు. దానివల్ల విపరీతమైన జలుబు, జ్వరం అని నీతో ఉన్నవారు చెబుతున్నారు. **అది కేవలం ఆహారం తీసుకునే మానవ శరీరం అయితే, వైద్యం, రక్షణ, సౌకర్యాలు, విశ్రాంతి కావాలి**.

కాని **ఏనభైఆరేళ్ళ వయస్సులో, సరైన ఆహారము, సౌకర్యాలు లేకపోయినా జ్వరంలో కూడా నడుస్తున్నావు**. అది నీ తపఃశక్తి యొక్క బలం. దైవం మానుష రూపేణా అన్నట్టు తోస్తున్నావు. మానవ శరీరం, దైవ శక్తి. శక్తి నీయందు నివసించి ఉంది. అందుకే నువ్వు దేవునిలా, శివునిలా కనపడుతున్నావు. **ఆరోజు నువ్వు అప్పటికే పద్దెనిమిది**

**కిలోమీటర్లు నడిచావు అని చెప్పారు.** కనుక ఇంకా నువ్వు ఎక్కువ శ్రమ పడకూడదు. నిన్ను శ్రమపెట్టేవాళ్ళం మేమే. అక్కడికి, ఇక్కడికి, ఎక్కడెక్కడికో రమ్మని మేమే నిన్ను ఆహ్వానిస్తాము.

సూర్యుడు అస్తమిస్తూ ఉండడంతో, దారి పక్కనే ఉన గ్రామం నిన్ను ఆహ్వానించింది. ఒక తోటలో, గోశాల ప్రక్కన, గడ్డి పైకప్పుతో ఉన్న చిన్న గుడిసెలో. కొన్నిసార్లు నువ్వు కూడా చిన్నపిల్లల్లా అందరి అభిప్రాయాలు విని, నీ సమ్మతి తెలుపుతావు.

అంత దూరం నడచినందుకు నీకు అలసట వెయ్యదా? నీకు ఆకలిదప్పులు లేవా? ఈ సాయం సంధ్య వేళ చిన్న గుడిసెలో కూర్చుని, అలసట అనేది లేకుండా వేలమందికి దర్శనం ఇస్తున్నావు. ఇది గొప్ప విషయం కాదా? రాజు తన అంతఃపురంలో ఉన్నప్పుడే ఎంతో ఆందోళనగా ఉంటాడు. కాని ఇక్కడ ఒక సన్యాసి ముందు, నేలపై దుమ్ము ధూళిలో కుటుంబంతో సహా కూర్చున్న ఈ సందూరు మహారాజు ఎంతో ఆనందంగా ఉన్నాడు.

మరుసటిరోజు నీవు పట్టణ ప్రవేశం చెయ్యాలన్నప్పుడు, మేము నీకు సాష్టాంగ నమస్కారం చేసి, సెలవు తీసుకున్నాము. అయిష్టంగానే నిన్ను ఊరి శివార్లలో వదిలి వెళ్ళిపోయాము. తెగిపోయిన నీ స్ఫటిక మాలను బాగుచేయించే భాగ్యం నా భర్తకు దొరికింది. నీ శరీరాన్ని తాకిన ఆ మాలను మా చేతుల్లో తాకడానికి మేము చేసిన పుణ్యం ఏమిటి? ఎన్నో సార్లు దాన్ని తాకి, ఆనందాశ్చర్యాలతో చూసి తరించాము.

నువ్వు ఏమీ తినవు. నీకు ఆకలి, దప్పికలు లేవు. అలసట అసలు రాదు. కాని నీ సేవకులు సామాన్యులు కదా! వారికి ఆకలిదప్పులు ఉంటాయి కదా! ఆరోజు రాత్రి వాళ్ళు వంట చేసుకోవడానికి కూడా ఓపిక లేదని చెప్పారు. అలా వాళ్ళు ఆకలితో నిద్రపోవడం నువ్వు ఒప్పుకోవు. కొంత ఉప్మా (కిచిడి) లేదా రవ్వ గంజి చూపాలని నువ్వు పట్టుబట్టావు. నేను ఆహారం పంపుతానని అన్నాను. కాని వారు కొంత ఉప్మా తయారుచేసి నీకు చూపుతామన్నారు. ఏం చెయ్యాలి? నిన్ను సంతృప్తి పరచడానికి కొన్నిసార్లు మోసం చెయ్యాలి.

ఆరోజు శనివారం. మరుసటి రోజు నువ్వు వస్తున్నావని మొత్తం నగరమంతా కోలాహలంగా ఉంది. నువ్వు ఇంట్లోకి రావని అందరికి తెలుసు. కాని ఇళ్ళన్నీ పండుగ వాతావరణం సంతరించుకున్నాయి. నేలపై పిండితో వేసిన ముగ్గులు, పూలతో మొత్తం

అలంకరణలు. ఎక్కడ చూసినా పెళ్లి సందడే. అందరూ ఎంతగానో ఉత్తేజితులయ్యారు. అందరి గుండెల్లో సంతోషం, ఉత్సాహం. మా ఇల్లు మొత్తం పవిత్ర వస్తువులతో, సరుకులతో నిండిపోయింది.

నువ్వు వచ్చావని ఎందుకు అందరికి అంత ఆనందం, ఉత్సాహం? నీవేమైనా రాజువా, రాజకీయ నాయకుడివా? ఐశ్వర్యవంతుడివా? లేక సినిమా నటుడివా? చేతిలో ఏమీ లేని ఒక సన్యాసివి నువ్వు. సన్యాసులకే సన్యాసివి. సన్యాసికి కనీసం మఠం అయినా ఉంటుంది. నీకు అదికూడా లేదు. అంతటి భాగ్యమా మాకు? ఇక్కడకు రావడానికి అంగీకరించినప్పుడు నిన్ను ఎక్కడ ఉంచాలా అని ఆలోచించాము. మా సమస్య ఏమిటంటే, నీకు కావాల్సిన నది ఒడ్డు కాని, సరస్సు కాని, బావి కాని ఇక్కడ లేవు. అదృష్టం కొద్ది మా పెరట్లో బావి త్రవ్వితే అందులో నీళ్ళు పడ్డాయి. త్వరితగతిన మిగిలిన బావి పనులు పూర్తి చేసి, పూజ కూడా చేశాము. మా ఇంటి కంచెకు తగిలేటట్టు ఒక చిన్న గుడిసె, ఒక షెడ్డు నిర్మించాము. మా ఇంటి అవుట్ హౌస్ ఖాళీ చేసి సిబ్బంది ఉండటానికి, వంటకు ఇచ్చాము.

*ఇక్కడి నుండి 'నువ్వు' అని వ్యవహరించలేదు. కేవలం 'పెరియవా'!*

మరుసటిరోజు ఆదివారం, 13-5-79, పరమాచార్య స్వామివారి ఎనభైఆరవ జయంతి మహోత్సవం. దాన్ని **హుబ్లిలో** జరపడం మా అదృష్టం. నా భర్త **గురుశంకర్** అధ్యక్షతన ధార్వాడ్ నుండి వచ్చిన వారితో ఒక బృందం ఏర్పడింది. ప్రముఖులు అందరూ చర్చించుకుని, ప్రజల నుండి ధనం సేకరించారు. మహాస్వామి వారిని ఆహ్వానించి, జయంతి ఉత్సవం జరపడానికి అందరికి పనులను అప్పజెప్పారు. ధార్వాడ్ కు చెందిన వేదపండితులు **శ్రీ బాలచంద్రశాస్త్రి గారి** పర్యవేక్షణలో ఏర్పాట్లు ఘనంగా జరుగుతున్నాయి. మేము ఎప్పుడెప్పుడు ఈ పేరును స్మరించినా, మాకు పరమాచార్య స్వామి వారు చెప్పిన మాటలే గుర్తుకు వస్తాయి, "దాన్ని మీరు 'ఫాలచంద్ర' అని పలకాలి, 'బాలచంద్ర' అని కాదు. చంద్రుని వంటి నుదురు ఉన్న వాడు అని దాని అర్థం".

ఆదివారం ఉదయం స్నానాదులు ముగించుకుని, పూర్ణకుంభంతో, మంగళ వాయిద్యాలతో అందరమూ కలిసి మహాస్వామి వారు ఉంటున్న చోటుకు వచ్చాము. స్వామివారిని ఆహ్వానించి, వారి ఆశీస్సులను అందుకున్నాము. భజనలు, నామావళి, నాదస్వరంతో స్వామివారిని గదగ్ రోడ్డు గుండా ఊరేగింపుగా తెచ్చి పట్టణ ప్రవేశం చేశాము.

కొద్దిమందిమి ఊరేగింపు మధ్యలో ఇంటి వద్దకు వచ్చి, హారతితో స్వామివారిని ఆహ్వానించడానికి తిరిగొచ్చాము. మా ఇంటి ప్రహరీ దగ్గర్లోని గోల్ఫ్ కోర్సులో స్వామివారు ఉండడానికి వసతి ఏర్పాటు చేశాము. కనుచూపుమేర పచ్చని నేల. వసతి ఎదురుగా రైల్వే లైను. అవతలివైపు ఉడిపి కృష్ణ దేవాలయం, రాఘవేంద్ర స్వామి బృందావనం. అది చాలా పెద్ద మైదానం కావడంతో ఎంతమంది భక్తులు వచ్చినా పరవాలేదు అనుకున్నాము, కాని వచ్చిన భక్తజన సందోహాన్ని తట్టుకోవడం చాలా కష్టం అయ్యింది.

మా ఇంటికి దగ్గర్లో, అంటే ఒక మూడు కిలోమీటర్ల దూరంలో ఉన్న హనుమాన దేవాలయంలో స్వామివారి జయంతి ఏర్పాట్లు చేశాము. ఆయుష్య హోమం, నవగ్రహ హోమం లాంటివి ఎన్నో నూటఇరవైఒక్కమంది బ్రాహ్మణుల మంత్రోచ్చారణలతో జరిగింది. పురప్రముఖుల అభ్యర్ధన మేరకు నేను మా వారు కార్యకర్తలుగా వ్యవహరించాము. మడిగా ఉంటూ వైదిక, ధార్మిక నియమాలను పాటిస్తూ, స్వామివారిని గౌరవించడానికి హనుమాన్ మందిరానికి వెళ్ళాము. అంతటి గొప్ప ఏర్పాట్లను, అంతటి దివ్య సమక్షాన్ని అప్పటిదాకా చూడలేదు. శాస్త్రోక్త పూజ, వైదిక క్రతువులు ప్రారంభం అయ్యాయి. దక్షిణాదిలోని ఎన్నో ప్రాంతాల నుండి వచ్చిన ఎందఱో పండితులు అక్కడ చేరి ఉన్నారు.

ఉదయం మొదలైన హోమాలు దాదాపు మధ్యాహ్నం మూడు వరకు సాగాయి. మహాస్వామివారిని ఊరెరిగింపుగా హనుమాన్ దేవాలయానికి తీసుకునివచ్చారు. భక్తులు భారీ సంఖ్యలో వచ్చారు. హోమగుండానికి ఎదురుగా ఉన్న ఒక చిన్న వేదికపై మహాస్వామి వారు కూర్చున్నారు. ఎక్కడ చూసినా జనసంద్రమే.

అక్కడ జరిగిన వసోదర హోమంలో నేను మా ఆయన పూర్ణాహుతికి నెయ్యి సమర్పించాము. స్వామివారు మాకు ఎదురుగానే కూర్చుని ఉన్నారు. హోమం పూర్తైన తరువాత తీర్ధ ప్రసాదాలు తీసుకుని, భక్తుల గుంపును దాటుకుని, స్వామివారి వద్దకు వెళ్లి సాష్టాంగ నమస్కారం చేశాము. స్వామివారు ప్రసాదాన్ని స్వీకరించారు. శ్రీవారికి సమర్పించమని ఎవరో బిల్వ మాలను మావారికి ఇచ్చారు. స్వామివారు మావారి చేతుల్లో నుండి ఆ మాలను తీసుకుని శ్రీవారే మెడలో వేసుకున్నారు. తరువాత దాన్నే మాకు ప్రసాదంగా ఇచ్చారు. నాకు కళ్ళ నీరు ఆగడం లేదు. శరీరం వణికిపోతోంది. ఎంతటి భాగ్యం మాకు! ఎవరు చేసుకున్న పుణ్యం ఇది. మామూలుగా జీవితంలో ఎన్నో భాగ్యాలు పొందుతాము. కాని **ప్రపంచాన్ని పాదాక్రాంతం చేసుకున్న మహాత్ముడిని గౌరవించే భాగ్యాన్ని**

**పొందడం** ఏమని చెప్పగలను? కేవలం పూర్వజన్మ పుణ్య విశేష ఫలం చేత మాత్రమే దక్కుతుంది. మాకు అనిపించేది ఒక్కటే, "హే భగవాన్! ఈ జన్మలో మమ్మల్ని ఉత్తములుగా చేసి, ప్రతి జన్మలోనూ ఇదే భాగ్యాన్ని ప్రసాదించు".

మేము మహాస్వామివారు ఇచ్చిన ప్రసాదాన్ని స్వీకరించగానే, అక్కడున్న కొంతమంది ఆడవారు మా పాదాలకు నమస్కరించి, మేము చాలా అదృష్టవంతులము అని చెప్పారు. నేను భావోద్వేగంతో ఏడ్చేశాను. తరువాత ఇరవైఏడు సుమంగళులకు చీరలు, రవికెలు అలాగే కన్య పూజకు కూర్చున్న ఆడపిల్లలకు బట్టలు ఇచ్చాము. అంతా ముగిసేటప్పటికి సాయంత్రం అయిదు గంటలయ్యింది. తరువాత మేము భోజనం చేశాము. అప్పటికే స్వామివారు మట్టిదారి గుండా నడచివెళ్ళి కుటీరానికి చేరుకున్నారు.

ఇది స్వామివారు హుబ్లి రావడానికి పదిహేను నెలల ముందు జరిగిన విషయం:-

పరమాచార్య స్వామివారు బళ్ళారి దగ్గరలోని హగరి అనే ప్రాంతంలో ఉంటున్నారని తెలియగానే మా ఆనందానికి అవధులు లేవు. అప్పుడు మా అత్తగారు, మామగారు, వదినా - మరదళ్ళు అందరూ హుబ్లిలోని మా ఇంటికి వచ్చారు.

మేమందరం హగరి నది ఒడ్డుకి బయలుదేరాము. లోపల గదిలో స్వామివారు జపంలో ఉన్నారు. హఠాత్తుగా గడిముందర ఒక దివ్యకాంతి. సూర్యోదయానికి ముందు ఉండే అరుణ వర్ణ వెలుగుకు, స్వామివారు ధరించిన కాషాయ వస్త్రాలకు తేడా లేదన్నట్టుగా దివ్య వెలుగులతో స్వామివారి దర్శనం. అదే మా మొదటి పరమాచార్య స్వామి దర్శనం. మేము స్వామివారిని చూడగానే, ఇక ఈ జన్మ నుండి మాకు ముక్తి అన్నట్టుగా స్వామివారిని కళ్ళల్లో నింపుకున్నాము. కాని ఆరోజు స్వామివారు కాష్ఠ మౌనంలో ఉన్నారని తెలిపారు. మేము సాయంత్రం దాకా అక్కడే ఉండి తిరిగొచ్చాము. పాల రుచి తెలుసుకున్న పిల్లిలా పదే పదే స్వామివారి దర్శనానికి వెళ్ళేవాళ్ళం.

రెండవసారి మేము హగరి వెళ్ళేటప్పటికి సాయంత్రం అయ్యింది. నిర్మాణ దశలో ఉన్న ఒక నూతన శివాలయంలో మహాస్వామివారు కూర్చుని ఉన్నారు. పూర్తిగా ఇంకా చీకటి పడలేదు. ఒక పెద్ద ఇత్తడి దీపం, లాంతరు వెలుగుతున్నాయి. పిల్లలతో కలిసి మేము నేలపై పడి స్వామివారికి నమస్కారం చేశాము. నా భర్త తన పేరు చెప్పగానే స్వామివారు, "నీకు ఈ పేరు ఎవరు పెట్టారు? ఎందుకు ఈ పేరు పెట్టారు?" అని అడిగారు. తన తాతగారు

తనకు ఈ పేరు పెట్టారని, ఇదే పేరు పెట్టడానికి గల కారణం తనకు తెలియదని తెలిపారు నా భర్త. స్వామివారు సేవకుడిని పిలిచి ఆ పేరును నేలపై రాసి తనకు చూపమన్నారు. తరువాత స్వామివారు మా స్వస్థలం గురించి, కుటుంబం గురించి అడిగి, **వేదిక్ స్కూల్ కృష్ణయ్యర్ మరియు దీవాన్ శేషయ్యర్** పేర్లు ఎప్పుడైనా వినడం జరిగిందా అని అడిగారు. మేము లేదని చెప్పాము. (తరువాత మేము విచారిస్తే వారు మా పూర్వీకులు అని తెలిసింది). తరువాత మా వారితో, "ఇప్పటిదాకా ఎలక్ట్రికల్ ఇంజనీర్ ను ఈ రైల్వే ఉద్యోగంలో నియమించలేదు. నీకు ఎలా దొరికింది? సాధారణంగా ఆపరేటింగ్ డిపార్టుమెంటు వాళ్ళనే డి.యస్. లు గా నియమిస్తారు" అని తెలిపారు.

"రాయచూరు నుండి పూణే రైలుమార్గానికి సమాంతరంగా ఒక రోడ్డు వెళ్తుంది తెలుసా?" అని మావారిని అడిగారు స్వామివారు. తెలియదన్నారు ఈయన. పోలీ వైద్యనాథ్ గురించి అడిగారు. అప్పుడు మేము మా అబ్బాయి శంకర్ గురించి దిగులుగా ఉన్నాము. అతనికి ఏ కళాశాలోనూ ప్రవేశం దొరకడం లేదు. అతనికి మంచి కళాశాలలో ప్రవేశం దొరికి జీవితంలో ఉన్నతుడు అవ్వాలని అప్పుడే మనస్సులో అనుకున్నాను. ఇది నేను పరమాచార్య స్వామివారికి చెప్పలేదు. కాని స్వామివారి అనుగ్రహం వల్ల మా అబ్బాయికి మంచి కళాశాలలో ప్రవేశం దొరికి బాగా చదువుకున్నాడు. ఎన్నో విషయాల్లో వాడికి మహాస్వామివారి అనుగ్రహం లభించింది.

మా పూర్వీకుల గురించి స్వామివారు అడిగిన విషయం చెప్పడానికే నేనీ సంగతులన్నీ చెప్పాను. ఇది జరిగిన దాదాపు సంవత్సరం తరువాత స్వామివారు హుబ్లికి వచ్చారు. హంపి, హోస్పేటలలో చాలా కాలం విజయం చేశారు. ఇప్పుడు హుబ్లిలో జరిగిన పరమాచార్య స్వామివారి జయంతి విషయాలకు వద్దాం. దాదాపు రాత్రి పది గంటలకు స్వామివారి జయంతి వైభవం ముగిసింది. మేమందరం పరమాచార్య స్వామి వారి దగ్గరే ఉన్నాము. ఆరోజు దేశం నలుమూలల నుండి భక్తులు వచ్చారు. ప్రత్యేక  బస్సులు, కార్లలో హుబ్లి చేరుకున్నారు. అంత పెద్ద ఇంటిలో కూడా వారికి సరిపోయే స్థలం లేకపోవడంతో వారు నిద్రించడానికి వరండా, కారు షెడ్డులాంటి ఇతర స్థలాలలో కూడా ఏర్పాట్లు చేశాము.

ఇత్తడి దీపస్తంభం వెలుగులో స్వామివారు కూర్చుని ఉన్నారు. మిగతా అంతా చీకటిగానే ఉంది. సామాన్యంగా ఎవరికీ ఏమీ కనపడదు. మమ్మల్ని లోపలకు రమ్మని పిలిచి, "అక్కడ నిలబడిఉన్న వ్యక్తి మీకు బంధువులు కదా?" అని అడిగారు. మాకు తక్షణం ఏమీ

అర్థం కాలేదు. వెనుక నుండి ఒక ఆడగొంతు “అవును, అవును” అని వినబడింది. తరువాత మాకు తెలిసింది అక్కడ ఉన్నది పార్వతీ, మైసూర్ చొట్టప్ప పెద్ద అన్నగారి కూతురు. తను మాకు బంధువు అని అప్పుడే మాకు తెలిసింది. మరలా మహాస్వామి వారు, “ఆరోజు మిమ్మల్ని కృష్ణయ్యర్, శేషయ్యర్ గురించి అడిగాను. వారు మీకు తెలియదని చెప్పారు. వారు ఎవరో అని ఎవరినైనా అడిగి ఉంటారు కదా? ఎవరిని అడిగారు? బహుశా ఇంట్లో ఉన్న పెద్దలని అడిగి ఉంటారు” స్వామివారే ప్రశ్న, జవాబు చెప్పేశారు. మా పిల్లల చదువు గురించి అడిగారు స్వామివారు. జయంతి కోసం చేసిన ఏర్పాట్ల గురించి అడిగారు, ఎంతమంది భోజనం చేశారు అని. తరువాత స్వామివారే ఒక విషయం గురించి చెప్పారు. ఆరోజు స్నానానికి ఎవరో గంగాజలం తెచ్చారు. చేతిలో ఉన్న మామిడి పండు జారి గంగలో పడింది. తరువాత నీరు రుచి చూస్తే ఎంతో తియ్యగా ఉన్నాయి.

చిన్నపిల్లాడిలా నవ్వుతూ, మామిడి పండు వల్ల గంగ తియ్యగా అయ్యిందా? లేక గంగ వల్ల మామిడిపండు తియ్యగా అయ్యిందా తనకే అర్థం కాలేదని అన్నారు. ఆ మామిడి పండులో కొంత భాగం తిని మిగిలింది మాకు పంపారు. గంగాజలం కూడా పంపారు. రెండూ తియ్యగా ఉన్నాయి. ఏదో  చెక్కెర కలిపినట్టు గంగ అంత తియ్యగా ఎందుకుందో అర్థం కాలేదు.

రాత్రి పదకొండు గంటలప్పుడు, పరమాచార్య కోసం చేసిన పూజా ప్రసాదాలను తీసుకుని కొంతమంది కారులో కాంచీపురం నుండి వచ్చారు. వారిని లోపలకు పంపి మేము బయటకు వచ్చాము. వచ్చినవారు మహాస్వామివారి మెడలో కామాక్షి ప్రసాదంగా పెద్ద పూలమాలను వేశారు. గులాబీ రంగు పట్టు వస్త్రాన్ని స్వామివారి తలకు పరివాట్టం కట్టారు. మహాస్వామివారు తలను చూపుతూ, “ఇందులో బంగారు జరీ ఉందా?” అని అడిగారు. అవునన్నారు. “అదిచుక్కల జరీనా?” అని అడిగారు. అవునన్నారు. స్వామివారు ఆ వస్త్రాన్ని చేతితో తాకి, “ఇది సాధారణ పట్టా లేక ఫైబ్రస్ పట్టా? ముట్టుకుంటే సాధారణ పట్టు లాగానే ఉంది” అన్నారు. “అవును అది సాధారణ పట్టు యే”. “ఓ! వారు పట్టు తెచ్చి నా తలకు చుట్టారు” అన్నారు.

రెండు కొబ్బరి చిప్పల్లో కామాక్షి ప్రసాదం ఉంది. అర్చనకుంకుమ, హోమ భస్మం - స్వామివారు రెండింటినీ తీసుకుని నుదురుపై ధరించారు. తరువాత వచ్చిన వారితో మఠం గురించిన విషయాలు మాట్లాడుతున్నారు. మేము గది నుండి బయటకు వచ్చి నిల్చున్నాము.

**వెంటనే స్వామివారు, "ఆమెఎక్కడ? గురుశంకర్ భార్య? ఆమెను పిలవండి" అన్నారు.** అంత హఠాత్తుగా స్వామివారు పిలిచేటప్పటికి కొద్దిగా ఆందోళన చెందాము. ఇద్దరమూ లోపలకు వెళ్లి సాష్టాంగం చేశాము. స్వామివారు రెండు కొబ్బరి చిప్పలను ప్రసాదాలతో సహా తీసుకుని నా చేతుల్లోకి విడిచారు. నాకు ఏమి అర్థం కాలేదు. అది ఎంత గొప్ప విషయమో మాకు తరువాత అందరూ, "కామాక్షి ప్రసాదాన్ని పరమాచార్య స్వామివారి చేతుల మీదుగా తీసుకోవడానికి మీరు ఎంతటి పుణ్యం చేశారు" అన్నప్పుడే అర్థం అయ్యింది.

ఇలా నాలుగు రాత్రులు, నాలుగు పగళ్ళు పరమాచార్య స్వామివారి దర్శనంతో పులకించిపోయాము. అపరిమిత సంతోషంతో గడిచిన రోజులు. మాటల్లో చెప్పలేని ఆనందం. మా జీవితాల్లోకెల్లా అత్యంత పుణ్యవంతములైన రోజులు.ఇంటి నిండుగా స్వామివారి భక్తులు, ఏమి పేరు? ఏ స్థలం? ఏ ఇంటివారు? ఏ స్థితి? ఏమీ తెలియదు. **అందరూ మాకు ఆప్తుల్లానే కనబడుతున్నారు**. అందరితోనూ ఆత్మార్థంగా మాటలాడవచ్చు. అందరూ ఒకే కుటుంబానికి చెందినవారులా ఉన్నారు. అందరూ పరమాచార్య కుటుంబానికి చెందినవారు, కేవలం ప్రేమ ఆప్యాయత ఉన్నవారు. పలు రకాల వ్యక్తుల్ని కలవగలిగాము, ఒకరి అనుభవాలను మరొకరు పంచుకుంటూ ఆనందపడ్డాము.

నాలుగవ రోజు, హఠాత్తుగా స్వామివారు నివాసం నుండి బయటకు వచ్చి, సైకిల్ రిక్షా టైర్లను నొక్కి గాలి ఉందా అని చూశారు. అంటే ఇక్కడి నుండి ఇక బయలుదేరుతారని సూచిస్తున్నారా? "చాలా రోజుల తరువాత మేము మీ ఇంట్లో సౌకర్యంగా ఉన్నామని స్వామివారికి తెలుసు. కనుక ఇక బయలుదేరుతారు" అని శిష్యులు నిర్ధారించారు. స్వామివారికి నమస్కరించి పరమాచార్య స్వామివారు మా తోటలోనికి వచ్చి కాసేపు కూర్చోవాలని ఆశ పడుతున్నామని తెలిపాము. స్వామివారు సమాధానం చెప్పలేదు. కొద్దిసేపు అక్కడంతా మౌనం. చుట్టూ ఉన్నవారు, "మహాస్వామివారు ఇంత దూరం వచ్చారు, అది మీ అదృష్టం. ఇంకా మీ తోట లోనికి కూడా రావాలా" అని నవ్వారు.

మరుసటి రోజు ఉదయం మేము స్వామి వారి వద్దకు వెళ్ళాము. మాకు ఒక విషయం తెలిసి కొంత బాధపడ్డాము. రాత్రి రెండు గంటలప్పుడు స్వామివారు మా తోటలోకి వచ్చారని, అప్పుడు మేము గాఢనిద్రలో ఉండడంతో చూడలేదు. మా గుండెల్లో భరింపలేని దుఃఖం, బాధ. కళ్ళల్లో నీరు కారుస్తూ, మౌనంగా నిలబడ్డాము. లోపలకు రమ్మని స్వామివారిని అడగడం సరైనదో కాదో మాకు అర్థం కాలేదు.

పరమాచార్య స్వామివారు జపం చేసుకుంటున్నారు. హఠాత్తుగా లేచి, చుట్టూ చూశారు. వెంటనే మెట్లు ఎక్కి తోటలోకి నడిచి ఇంటి చుట్టూ వెళ్తుండగా, వారి కాళ్ళకు ఉన్న పాదుకలలో ఒకటి విరిగిపోయింది. కేవలం చెక్క పిడి మాత్రం వేళ్ళ మధ్యన ఉండిపోయింది. దాంతో స్వామివారు ఆగిపోలేదు. ఒక కాలుకు పూర్తి పాదుకతో ఒక కాలుకు కేవలం పిడితో అలాగే నడుస్తూ వెళ్ళారు. స్వామివారి శిష్యులు పరుగుపరుగున వెళ్లి మరొక జత పాదుకలు తెచ్చారు. ఎంతటి కారుణ్యం! రాత్రి స్వామివారు తోటలోకి వచ్చారని విని బాధపడుతున్న మమ్మల్ని ఒదార్చడానికి, సంతోషపెట్టడానికా అన్నట్టు, మా ఎదురుగా మరొక సారి తోటలోనికి వచ్చారు. ఆ కరుణను ఏమని చెప్పగలం? దాన్ని దేనితో పోల్చగలం? కేవలం కరుణా సముద్రముతోనే.

స్వామివారు హఠాత్తుగా మరొక చోటుకు వెళ్ళడం మాకు తీరని బాధను కలిగించింది. మా ఇంటి నుండి అందరూ పరమాచార్య స్వామివారిని అనుసరించారు. ఇల్లు మొత్తం ఖాళీ అయిపోయింది. నాటకం ముగిసిన తరువాత ఖాళీ అయిన వేదికలా ఉంది. ఒక్కరోజులో అందరు బంధువులూ మమ్మల్ని వదిలి వెళ్లినట్టు అయ్యింది. కాని అందరి బంధువు అయిన పరమాచార్య స్వామివారు రావడం, మాతో ఉండడం, ఆశీర్వదించడం, అంతులేని అనుగ్రహం ఇవ్వడం - ఈ జన్మ మొత్తానికి పదే పదే గుర్తు చేసుకోవాల్సిన మధురస్మృతులు. మహాస్వామి వారిని దర్శించుకున్న తరువాత మాకు కలిగిన అనుభవం, పొందిన అనుభవం మాటల్లో చెప్పలేను. ఒక తాతగారిలా, బంధువులా, తల్లిలా ఎన్నో విషయాలు తెలిపి మమ్మల్ని ఆనందింపచేశారు. చక్కెర తెయ్యగా ఉంటుంది అంటే సరిపోదు, అది రుచి చూస్తేనే దాని తియ్యదనం తెలుస్తుంది. అలాగే, మాకు పరమాచార్య స్వామివారితో కలిగిన అనుభవం, ఆనందం చెప్పినా వ్రాసినా, అది వేరేవాళ్ళు అర్థం చేసుకోలేకపోవచ్చు. దాని గొప్పతనం, మహత్వం తెలియాలంటే దాన్ని ఆత్మార్థంగా అనుభవించిన వారికే తెలుస్తుంది.

-- కమలా గురుశంకర్. మహా పెరియవాళ్ - దరిశన అనుభవంగళ్ 1

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం ॥

# 31. మహాస్వామిలో అల్లాదర్శనం

పరమాచార్య స్వామివారు హైదరాబాద్ లోని భీమా నదికి ఉపనది అయిన కాగ్న నది ఒడ్డున ఉన్న ఎ.సి.సి సిమెంటు కర్మాగారం పంపింగ్ స్టేషనులో మకాం చేస్తున్నారు. ఆ ప్రదేశం పాత హైదరాబాద్ సంస్థానానికి చెందినది. ఇప్పుడు అది కర్ణాటక రాష్ట్రంలో ఉంది.

ఆ ప్రాంతానికి ఒక కిలోమీటరు దూరంలో **భీమసేనప్ప కిట్టప్ప** అనబడే ఒక వ్యక్తికి చెందిన తోట ఉంది. నవాబుల కాలంలో మితిమీరిన రజాకర్ల దురాగతాలను ఎదుర్కొని పోరాడి గెలిచిన వ్యక్తి ఇతడు. పరమాచార్య స్వామివారు తన స్థలాన్ని సందర్శించాలన్న అతని కోరికను మన్నించి ఒకరోజు స్వామివారు అక్కడకు వెళ్ళారు.

మధ్యాహ్న సమయంలో ఒక ముస్లిం భక్తుడు స్వామివారి దర్శనానికి వచ్చాడు. “ఉదయం నీ భార్య దర్శనానికి వచ్చి పళ్ళు సమర్పించింది” అని స్వామివారు చెప్పగా, అతను ఆశ్చర్యపోయి “నేను ఒక అంగడిలో పనిచేస్తాను. ఉదయం మీరు రిక్షా సైకిలు పట్టుకుని నడచుకుంటూ వస్తున్నప్పుడు, **బాబా(స్వామివారు) నన్ను చూశారు. తమరిలో నాకు అల్లాహ్ నే కనిపించారు. అంతేకాక నా మాతృభాష ఉర్దూలో మీరు ఏదో చెప్పినట్టుగా అనిపించింది.** నా పని సమయం అయిపోయిన తరువాత ఇప్పుడు మీ వద్దకు రాగలిగాను. ఇంట్లో నా భార్య మిమ్మల్ని దర్శించుకున్న విషయం తెలిపింది” అని చెప్పాడు.

స్వామివారితో మాట్లాడి సాష్టాంగంచెయ్యగానే అతనికి పళ్ళు ఇచ్చి, అనుగ్రహించి ఆశీర్వదించారు. **అంతా తానే అయిన పరమాచార్య స్వామివారు అతనికి అల్లాహ్ లా కనబడడం ఆశ్చర్యరకరమైన విషయం కాదు**.

-- ఒక భక్తుడు. మహా పెరియవాళ్ – దరిశన అనుభవంగళ్ 3

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం ॥

# 32. మహాస్వామి-ఖురాన్

సుమారు 10 - 12 సంవత్సరాల క్రితం ఒక మహమ్మదీయుడు నా క్లినిక్ కు వచ్చాడు. నా గదిలో ఉన్న పరమాచార్య స్వామివారి చిత్రపటం చూసి, భక్తితో తలవంచి స్వామివారి పటానికి నమస్కరించి, 'మహాస్వామి వారు చాలా గొప్ప వారు, వారు నడిచే దేవుడు' అని అన్నాడు. నాకు చాలా ఆశ్చర్యమేసి "నీకు మహాస్వామి వారి గురించి ఎలా తెలుసు?" అని అడిగాను. ఆ ముస్లిమ్ పెద్దమనిషి మహాస్వామి వారితో తన అనుభవాన్ని ఇలా పంచుకున్నాడు.

"అయ్యా ముప్పై సంవత్సరాల క్రితం నేను విద్యుత్తు శాఖలో లైన్-మేన్ గా పని చేసేవాణ్ణి. ఒకసారి మేము ఒక ఐదు ఆరుగురు బృందం కలిసి కంచి మఠం వెళ్ళాము. ఏదో చిన్న విద్యుత్ లోపం ఉంటే దాన్ని సరిచేయడానికి వెళ్ళాము. అక్కడ కూర్చున్న మహాస్వామి వారు చేతితో సైగచేసి నన్ను దగ్గరకు రమ్మన్నారు. నేను వెళ్ళి వారి ముందు నిలుచున్నాను. రోజూ ఐదు పూట్ల నమాజ్ చేస్తున్నావా? అని అడిగారు.

వారు నా మతము గురించి ఏమి అడగకుండానే నేను మహమ్మదీయుడనని గుర్తుపట్టినందుకు నాకు చాలా ఆశ్చర్యమేసింది. కానీ అది నాకు కలగబోయే ఆశ్చర్య పరంపరకు ఆరంభం మాత్రమే. అప్పుడు మహాస్వామి వారు పవిత్ర ఖురాన్ నుండి కొన్ని వాక్యాలు చెప్పారు. మేము తమిళులం కాబట్టి మేము ఖురాన్ చెదివితే అరబిక్ లో మా తమిళ యాస కొట్టొచ్చినట్టు కనబడుతుంది.

కానీ **మహాస్వామి వారు ఒక అరబ్బీ వ్యక్తి ఎలా తమ మాతృభాషను మాట్లాడతాడో, అంత స్వచ్ఛంగా చదివారు. వారి ఉచ్చారణ నిజంగా అద్భుతం.** నేను ఇదే గొప్ప అనుకుంటే మళ్ళా నేను ఆశ్చర్యపోయేలా చేసారు.

మహాస్వామి వారు ఒక విషయం చెప్పి, "ఖురాన్ లో ఎన్ని సార్లు నమాజ్ చేయమని చెప్పబడింది?" అని అడిగారు?

అది అందరికి తెలిసిన విషయం కావున "ఐదు సార్లు" అని చెప్పాను. అప్పుడు మహాస్వామి వారు స్థానిక ఖాజి దగ్గరకి వెళ్ళి అడిగి తెలుసుకుని రమ్మన్నారు. నేను కనుక్కుని వచ్చి వారితో అదే చెప్పాను. కానీ స్వామివారు నన్ను మద్రాసులో ఉన్న ప్రధాన ఖాజిని కలిసి, వారిని అడిగి తెలుసుకుని రమ్మన్నారు. ఆయన ఐదు సార్లు అని చెప్పడమే కాకుండా

ఇటువంటి పనికిమాలిన ప్రశ్న అడిగినందుకు నాకు చివాట్లు పెట్టి పంపించారు. స్వామివారికి నేను అదే చెప్పాను.

ఒక అద్భుతం జరిగింది. **మహాస్వామివారు ఒక ఖురాన్ తెప్పించి వెంటనే ఒక పుటను తీసి నాకు చూపిస్తూ దాన్ని చదువుతూ ఖురాన్ లో రోజుకు ఆరు సార్లు ప్రార్థన చెయ్యమని ఉంది అని చెప్పారు. కానీ ఆరవ సారి చేసే ప్రార్థన రాత్రి 11:30కు చెయ్యాలి, కాబట్టి దాన్ని చాలామంది వదిలేసారు. అప్పుడు స్వామి వారు నువ్వు ఇకనుండి ఆరు సార్లు చెయ్యి. చేస్తే ఫలితం బాగా ఉంటుంది అని చెప్పారు.** సర్ ఇది నిజం, స్వామి వారు చెప్పింది అక్షర సత్యం. నేను విద్యుత్శాఖ లో ఎగ్జిక్యూటివ్ ఇంజనీయరుగా రిటైర్ అయ్యాను.

మళ్ళా నేను ఎప్పుడైనా పని మీద కామాక్షి అమ్మవారి దేవస్థానానికి వెళ్తే మహాస్వామి వారు నన్ను గుర్తుపట్టి నేను ఎన్ని సార్లు నమాజ్ చేస్తున్నానో కనుక్కునేవారు!!”

ఏమి మహాస్వామి వారి విజ్ఞానం. వారు నడిచే ఎన్సైక్లోపీడియా.

**సర్వాంతర్యామి, సర్వేశ్వరుడు అయిన ఆ ఈశ్వరుడు మానవ రూపంలో ఈ భువిపై నడయాడారు.**

మహాస్వామి వారు కుల మత జాతి వర్గ విచక్షణ లేకుండా ఎందరినో ఉద్ధరించారు.

జయ జయ శంకర! హర హర శంకర!!

-- డా. వెంకటరాఘవన్, కంటి వైద్యులు

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం ।
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం ॥

# 33. మోక్షం కావాలి

ఒకరోజు **పరమాచార్య స్వామివారి దర్శనానికి ఒక గూర్ఖా వచ్చాడు.** మనసులోని కష్టాల భారం ముఖంలో ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. "విషయమేంటో అడుగు అతణ్ణి అడుగు" అని పక్కనున్న శిష్యునితో చెప్పారు స్వామివారు.

ఆ గూర్ఖా స్వామివారితో, "నేను పుట్టినప్పడినుండి నాకు కష్టాలు తప్ప ఏమి తెలియవు. ఏదో నా పురాకృత పుణ్యకర్మ వల్ల దైవస్వరూపులైన పరమాచార్య దర్శనానికి రాగలిగాను. **నేను మళ్ళీపుట్టకుండా మీరు నన్ను అనుగ్రహించవలసిందిగా ప్రార్థిస్తున్నాను"** అని వేడుకున్నాడు.

"అహా! అలాగే అవ్వని. ఇక నువ్వు మరలా పుట్టవు. నీకు మోక్షం ఇచ్చేస్తా" అని అనలేదు మహాస్వామివారు. చాలా ప్రేమతో అతనితో మాట్లాడారు.

"అటువంటి వరాన్నిఇచ్చే శక్తి నాకులేదు. కాని నేను నిత్యం కొలిచే త్రిపురసుందరీ సమేత చంద్రమౌళీశ్వరునకు ప్రార్థిస్తాను నీ కోరిక పూర్ణం అవ్వాలి అని" అని చెప్పారు.

ఆ గూర్ఖా ఈ జవాబు చాలు అనుకున్నాడు. ప్రసాదం తీసుకుని వెళ్ళబోతూ, **"నేను ఇకమళ్ళా పుట్టను. నాకుమరుజన్మలేదు. ఇదిఈశ్వరశాసనం"** అంటూ సంతోషంతో వెళ్ళిపోయాడు.

***జ్ఞానమనే వెలుగును పంచే మెరుస్తున్న కళ్ళతో స్వామివారు, "చాలాకాలం తరువాత పునావృత్తి రహిత శాశ్వత శివసాయుజ్యం కావాలని కోరినవాడు ఇతనొక్కడే" అని తెలిపారు.***

నేను విన్న ఒక విషయం నాకు స్ఫురణకు వచ్చింది. ఒక పండితుడు రామాయణ ఉపన్యాసం చెబుతూ, *"రాముడు సాక్షాత్ మనవావతారం. మనుష్యుడిగానే పుట్టాడు, మనుష్యుడిగానే కదిలాడు. మరి జటాయువుకు మోక్షాన్ని ఎలా ఇవ్వగలిగాడు అంటే అది కేవలం స్వధర్మాచరణ వల్ల మాత్రమే సాధ్యపడింది"*

*శ్రీమఠం ఉద్యోగులు గాని , శిష్యులు గానిఎవ్వరూ స్వామివారు అపర శివావతారులు అని గ్రహించలేదు. కాని ఆ గూర్ఖా దాన్ని గ్రహించాడు.*

[సరస్సులో ఉన్న పద్మంయొక్క విలువ అక్కడే ఉన్న కప్పలకు కాని చేపలకు కాని తెలియదు. కాని ఎక్కడో అడవిలో ఉన్న తుమ్మెదకు దాని విలువ తెలుసు. అందులో ఉన్నది మకరందమని తెలుసు. దాన్ని గ్రోలడానికి పద్మం ఎక్కడ ఉన్నా తుమ్మెద వెతుక్కుని వచ్చి మరీ ఆస్వాదిస్తుంది]

-- శ్రీమఠం బాలు మామ, 'ఇన్ ద ప్రెజెన్స్ ఆఫ్ డివైన్' పరమాచార్య అనుభవాల సంగ్రహం

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం ।
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం ॥

# 34. రామనామం – విభూతి

ఒక పెద్దమనిషి పరమాచార్య స్వామివారిని దర్శించుకోవడానికి వచ్చి తన గురించి చెప్పుకుని తను ఎక్కడనుండి వచ్చాడొ చెప్పాడు.

“మీ ఊళ్ళో '**టుక్కిరి పాట్టి**' అని ముసలావిడ ఉంది, నీకు తెలుసా” అని అడిగారు మహాస్వామివారు.

“ఆమె మాకు సంబంధీకురాలు” అని చెప్పాడు.

“రామ వినాయకుడు . . . ఇంకా ఉన్నాడా?”

“మా ఊరిలో ఉన్న దేవాలయలోని వినాయకుడు 'రామ వినాయకుడు' అని ప్రసిద్ధి” అని బదులిచ్చాడు. ఆ ముసలావిడ, వినాయకుని గురించి పరమాచార్య స్వామివారు చాలా విషయాలు అడిగారు. కాని ఆ భక్తుడు వాటికి సరైన జవాబులు చెప్పలేకపోయాడు. స్వామివారి ప్రశ్నలకు అతను కకావికలమైపోయాడు.

తరువాత మహాస్వామివారే ఆ కథనంతా ఇలా చెప్పారు.

“ఆ ఊళ్ళో శివాలయం కాని విష్ణ్వాలయం కాని లేవు. ఉన్నది ఒక్కటే ఆలయం అది వినాయకుని ఆలయం. రోజూ ఉదయం, సాయంత్రం ఆ ఊరి బ్రాహ్మణులు పొలిమేరలో ఉన్న వాగులో స్నానాదికాలు చేసుకుని సంధ్యావందనం చేసేవారు. తిరిగివస్తూ దార్లో ఉన్న వినాయకుని గుడికి వెళ్ళి అక్కడ కూర్చుని రామనామాన్ని జపం చెసేవారు. ఊళ్ళోనివారు కూడా వారితో కలిసి రామ సంకీర్తనం చేసేవారు. వారి నామజపం ఎంతటిది అంటే ఒక మైలుదూరం నుండి కూడా వారి నామసంకీర్తనం వినపడేది అని నాతో చెప్పారు.

వినాయకుని దేవాలయంలో రామనామం చేసేవారు కాబట్టి అది రామనామ వినాయక దేవాలయంగా ప్రసిద్ధికెక్కింది.

**టుక్కిరి పాట్టి ఎవరంటే, ఏడేళ్ళ చిరుప్రాయంలో ఒక ఆడపిల్లకు వివాహం చేశారు. కాని విధివశాత్తు తొమ్మిదేళ్ళకే భర్త చనిపోవడంతో విధవరాలు అయ్యింది. ఆ ఊరివాళ్ళు ఆ అమ్మాయిని దురదృష్టవంతురాలుగా పరిగణించేవారు. దాంతో అమ్మాయిని 'టుక్కిరి (నష్టజాతకురాలు)' అని తన దురదృష్టాన్ని ఎత్తిచూపుతూ పిలిచేవారు.**

ఆ అమ్మాయి పెద్దదైన తరువాత తన స్థితిని అర్థం చేసుకుంది. ఇప్పటిలాగా అప్పట్లో విప్లవాలు చేసి సంఘ సంస్కరణలు చేసే కాలం కాదు. ఊరి వాళ్ళని కాదని ఏమిచేసే పరిస్థితి కూడా కాదు. కాబట్టి పూర్వసువాసినులకు విధించిన పాతపద్ధతుల ప్రకారం ఆ అమ్మాయి జీవనం సాగించేది. రోజూ తెల్లవారుఝామున నాలుగు గంటలకే లేచి బయటకు వచ్చి ఇంటిముందు అలికి శుభ్రం చేసి, బయట ఒక దీపం వెలిగించి ఇంటిలోపలికి వెళ్ళిపొయేది. **మరి ఆమె లోపల ఏం చేసేది? ఏమిలేదు కేవలం రామ నామ జపం. ప్రాణం నిలబెట్టుకోవడానికి ఏదో కాస్త వండుకుని తినేది**. అప్పుడప్పుడు ఎవరో ఒకరు తినడానికి ఇచ్చి వెళ్ళేవారు.

**తిరువయ్యారు త్యాగరాజుస్వామి ఇరవైఒక్క సంవత్సరాల పాటు రామనామం జపించారు. ప్రతిరోజూ *లక్షాఎనిమిదివేల* సార్లు రామనామాన్ని జపించేవారు. కాలగమనంలో టుక్కిరిగా ముద్ర పడిన ఆ అమ్మాయి 'టుక్కిరి పాట్టి (అవ్వ)' అయ్యింది. ఆమె జపం లెక్కపెట్టలేనంత అయ్యింది. ఆమె ఎంత జపంచేసిందో కేవలం రామచంద్ర ప్రభువుకు మాత్రమే తెలుసు.**

ఒకరోజు ఆ ఊళ్ళో ఒక పిల్లవానికి విపరీతమైన కడుపు నొప్పి వచ్చింది. భరించలేనంత నొప్పితో అల్లాడిపోతున్నాడు. బాధతో ఏడుస్తున్నాడు. ఊర్లోని వైద్యుడు అల్లం, వాముతో కషాయం చేసి తాగించమన్నాడు. ఊర్లో ఎవరితోనూ ఇవి లేవు. ఇక గత్యంతరం లేక టుక్కిరి పాట్టి వద్ద ఉన్నయేమో వెళ్ళి అడగమన్నారు. ఆ చిన్నవాడు వెళ్ళి భయంతో, "కొంచం వాము కావాలి" అని అడిగాడు. పట్టి వాముతో పాటు మరికొన్ని అవసరమైన దినుసులు ఇచ్చి "ఎందుకు, ఏమైంది నీకు?" అని అడిగింది.

"కడుపు నొప్పి. . . చాలా ఎక్కువగా ఉంది . ."

"ఉండు... ఇప్పుడే వస్తాను"

పాట్టి కొంచం విభూతి తీసుకువచ్చి 'రామ నామం' చెప్తూ, ఆ పిల్లవాడి నుదుటున పెట్టింది.

వాడు ఇంటికి పరిగెత్తాడు. "నాకు కషాయం వద్దు"

"ఎందుకు?"

**"కడుపునొప్పి పోయింది"**

ఆ బాలుడి తల్లి విషయం అర్థంకాక తికమకపడి బాలుని నుదిటిపైనున్న విభూతిని చూసింది.

**"పాట్టి పెట్టింది. వెంటనే నా కడుపునొప్పి పోయింది"** అని చెప్పాడు.

మొత్తం ఊరంతా ఈ విషయం తెలిసిపోయింది. 'టుక్కిరి పాట్టి'కి అంతటి సిద్ధి కలిగిందా?

అంటే ఆమె **ఇప్పుడు** **"టుక్కిరి" కాదన్నమాట**. ***రామనామ మహత్యాన్ని చాటి చెప్పడానికే విధి ఆమె తలరాతని అలా రాసింది. ఆ ఊరి వైద్యుడితో ఇక పనిలేదు. ఆయన స్థానాన్ని రామనామ పాట్టి తీసుకుంది. ఆవిడ వద్ద ఉన్న మందు కేవలం చిటికెడు విభూతి అంతే!!*** "

మహాస్వామి వారు వీటిని చెప్పగా విన్నవారు ధన్యులు.

-- మహాపెరియవళ్ – దరిశన అనుభవంగళ్

# 35. కేసు - ఫైల్సు – స్వామివారి చూపు

ఈ పరిశ్రమ భాగస్వామ్య వ్యాపారం. చాలా డబ్బు పెట్టుబడిగా పెట్టారు. కొద్దిగా సమస్యలు రావటంతో మరొక వాటాదారు వ్యాపార వ్యవహారాల్లో పాలుపంచుకోక మిన్నకుండిపోయాడు. కాని మరొకతను మాత్రం చాలా కష్టపడి అహరహము శ్రమించి వ్యాపారాన్ని మళ్ళా గాడిలో పెట్టాడు. కాని కొద్ది కాలానికి అది కోర్టు కేసుగా మారింది. మొత్తం వ్యవహారం అంతా ఒంటిచేత్తో నడిపిస్తున్న వ్యక్తి ఒక లాయరును ఆశ్రయించాడు. ఇతను మరియు ఇతని న్యాయవాది ఇద్దరూ పరమాచార్య స్వామివారి భక్తులే.

ఆ న్యాయవాది కంచికి వెళ్ళి మహాస్వామివారి ఆశీర్వాదం తీసుకుందాము అని సలహా ఇచ్చాడు. కాని ఇతను అందుకు అంగీకరించక, “ఇటువంటి ఐహిక విషయం గురించి స్వామివారిని ఇబ్బంది పెట్టడం తనకు ఇష్టం లేదని” చెప్పాడు. న్యాయవాది ఆశ్చర్యంతో అతని వ్యక్తిత్వానికి ముగ్ధుడై “సరే! నేను ఈ కేసు తీసుకుంటాను. కేవలం మనల్ని సరైన దారిలో నడిపించమని మాత్రమే స్వామివారిని ప్రార్థిద్దాము” అని చెప్పాడు. అతను అందుకు అంగీకరించి మరునాడు కంచికి పయనమయ్యారు.

ఆ లాయరు కేసు ఫైల్సునన్నింటిని కారు వెనుక సీటులో పెట్టి తలుపు బార్లా తెరిచాడు. “స్వామివారి కళ్ళు వాటిపై పడితే అది మనం వారి ఆశీర్వచనంగా భావిద్దాము” అని చెప్పాడు. ఆరోజు మఠం బాగా రద్దీగా ఉంది. వాళ్ళిద్దరూ, కారువద్ద నిలబడి సహనంతో వేచి చూస్తున్నారు. హఠాత్తుగా వారు స్వామివారికి దారి ఇమ్మని చెప్తున్న శిష్యుల గొంతు విన్నారు.

కొద్దిసేపటి తరువాత పరమాచార్య స్వామివారు వచ్చి కారు వద్ద నిలబడ్డ వారిద్దరిని చూస్తూ వారి వద్దకు వచ్చారు. ఇద్దరూ నిశ్చేష్టులయ్యి నిలబడిపోయారు. స్వామివారు ఆగి వెనుకసీటులో ఉన్న కేసుఫైల్సు వంక చూసి వచ్చిన పని అయ్యిందన్నట్టుగా చకచకా వెళ్ళిపోయారు. ఆ సంఘటననుండి తేరుకోవడానికి వారిద్దరికి కొద్ది సమయం పట్టింది. స్వామి అశీర్వాదం లభించిందని వారికి అర్థమైంది.

వేంటనే వారు అక్కడినుండి బయలుదేరి వెళ్ళారు. అతను ఇంటికి చేరగానే నవ్వుతూ వస్తున్న తన భార్యను చూసి ఆశ్చర్యపోయాడు. ఎవరో తమ ఫ్యాక్టరీ కొనడానికి

వచ్చారని చెప్పింది. “కాని ఇందుకు నా భాగస్వామి కూడా ఒప్పుకోవాలి కదా” అని అన్నాడు. అతను ఇప్పటికే ఒప్పుకున్నాడంట అని చెప్పింది ఆమె.

కొద్దిరోజుల తరువాత అమ్మకం వ్యవహారం పూర్తి అయ్యి వారిద్దరు ఊహించని మొత్తం వారికి వచ్చింది అమ్మకం వల్ల. **అతను తన స్వంత ఊర్లో ‘అతిరుద్ర మహాహోమం’ నిర్వహించాడు మహాస్వామివారికి అది అత్యంత ఆనందదాయకమని తెలిసి**.

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం!
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం !!

# 36. స్వామివారు మాయమయ్యారు

ఆరోజు శ్రీమఠంలో చాలా గందరగోళంగా ఉంది. పరమాచార్య స్వామివారు ఎక్కడా కనపడడంలేదు. “అంతమంది ఎప్పుడూ వారి చుట్టూ పరివేష్టించి ఉండగా, ఇంతమంది సేవకులు ఎప్పుడూ వారి చుట్టూ ఉండగా స్వామివారు ఎలా మాయం అయ్యారు? ఇంతమంది శిష్యులు, కాపలా వాళ్ళు ఏంచేస్తున్నారు” అని సీనియర్ మేనేజరు కనపడ్డవారందరిని చడామడా తిట్టేసారు.

ఎప్పటిలాగే ఆ ఉదయం కూడా గడిచింది. మామూలుగానే మహాస్వామివారు తెల్లవారుఝామునే లేచి, స్నాదులు కావించి, రోజూ చేసే గంట జపం ముగించి, త్రిపురసుందరీ సమేత చంద్రమౌళీశ్వర ఆరాధన చేసి, వచ్చిన భక్తులందరికి తీర్థ ప్రసాదాలు ఇచ్చారు. మరలా స్నానం చేసి అనుష్టానం చేసుకుని భిక్షకు వెళ్ళారు. అంతే తరువాత వారు ఎవ్వరికి కనబడలేదు. జరిగిన విషయంను తెలుసుకుని సీనియర్ మేనేజరు అగ్గిమీద గుగ్గిలం అయ్యారు.

ఇద్దరు సేవకులు ఎప్పుడూ స్వామివారి వద్దనే ఉంటారు. ఒకరికి ఆరోగ్యం బాగోకపోవడం చేత విశ్రాంతి కోసం వాళ్ళ ఊరు వెళ్ళాడు. ఇంకొకరు తన తండ్రికి శ్రాద్ధం పెట్టడానికి ఊరికి వెళ్ళాడు. స్వామిగురించి పూర్తిగా తెలియని కొత్తగా చేరిన ఆంతరంగికుడు స్వామితో ఉన్నాడు. స్వామివారు భిక్ష స్వీకరించడానికి వెళ్ళగానే ఇతడు ఒక కునుకు తీద్దామని వెళ్ళాడు. భిక్ష తరువాత స్వామివారు ఒక చిన్న గదిలోకి వెళ్ళి వెదురు చాపపై పడుకుని చాపని చుట్టుకున్నారు.

ప్రతి ఒక్కరి మొహంలోను ఆందోళన కనబడుతోంది. సేవకుణ్ణి అడిగితే, "కాస్త కునుకు తీయడానికి వెల్యాను. నాకు తెలియదు" అని చెప్పాడు. ఏం చెయ్యాలో ఎవరికి పాలుపోవడం లేదు. విషయాన్ని అందరికి తెలిపి అందర్నీ ఇబ్బంది పెట్టలేరు, అలాగని స్వామివారు ఎక్కడున్నారో వెతకకుండా ఊరికే కూర్చోనూలేరు. స్వామివారు అలా చాపలో చుటేసుకుని ఉన్నారని ఎవరూ ఊహించలేకపోయారు. చివరికి సాయింత్రం ఐదున్నరకి అనుష్టానం కోసం స్వామివారు లేచివచ్చారు. చంద్రమౌళీశ్వర పూజ మందిరంలోకి వచ్చి భక్తులకు దర్శనమిచ్చారు. అప్పుడు అందరూ ఊపిరి పీల్చుకోగలిగారు.

అంతలోనే చాలా జరిగిపోయింది. ఆ కొత్తగా వచ్చిన ఆంతరంగికుడికి మేనేజరుతో దెబ్బలు పడ్డాయి. ఒక ముసలావిడ వినాయకుణ్ణి మొక్కుకుంది, "స్వామివారు సురక్షితంగా ఉండాలి. నీ గుడిముందు నూటెనిమిది కొబ్బరికాయలు కొడతాను" అని.

"అమ్మా, కామక్షి! నీకు పాలాభిషేకం చేయిస్తాను తల్లీ! పరమాచార్య స్వామివారు తిరిగి రావాలి" అని ఒక ఇంటావిడ మొక్కుకుంది.

ఇంకొకావిడ ఏడుకొండలవాడికి మొక్కుకుంది, "శ్రీనివాసా! మహాస్వామివారిని వెతికి తెచ్చివ్వు. నేను అంగప్రదక్షిణ చేస్తాను" అని

మహాస్వామివారిని చూడగానే సీనియర్ మేనేజరు పరుగు పరుగున వెళ్ళి సాష్టాంగ పడి ఆనందంతో జరిగిన విషయమంతా చెప్పాడు. "మీరు కనపడకపోయేసరికి మేమందరమూ అల్లాడిపోయాము. మీరు క్షేమంగా ఉండాలని అందరూ మొక్కులు మొక్కుకున్నారు" అని చెప్పాడు.

"అందరూ నాకోసం మొక్కులు మొక్కుకున్నారా? మరచిపోకుండా మీరు మీ మొక్కులు తీర్చండి. నేను వందేళ్ళు బ్రతుకుతాను. మీరేమి భయపడవద్దు" అని అభయమిచ్చారు. తరువాత స్వామివారు ఆ కొత్తసేవకుణ్ణి పిలిచి సమాధాన పరిచారు. "నీకు తగిలిన చెయ్యి దెబ్బలు మద్యాహ్నం పూట పడుకున్నందుకు కొట్టారని భావించు. అపహార్ణ నిద్ర శాస్త్ర సమ్మతం కాదు" అని ఏవేవో విషయాలను, పాత సంఘటనలను చెప్పి అతణ్ణి ఉల్లాసపరిచారు. పరమాచార్య స్వామివారి దివ్య క్రీడ ఇది!!

-- 'ఇన్ ద ప్రెజెన్స్ ఆఫ్ డివైన్' పరమాచార్య అనుభవాల సంగ్రహం

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం!

శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం !!

# 37. ఎనిమిది అణాలు - ఆశీర్వాదాలు

ఇటీవలే కాలు విరిగిన ఒక పెద్దాయన అలసటతో శ్రీమఠం బయట కూర్చున్నాడు. పరమాచార్య స్వామివారు ప్రధానద్వారం గుండా వెళ్తూ, అతణ్ణి గమనించారు. దర్శనానికి వచ్చిన ఒక భక్తుడు స్వామివారికి దగ్గర్లో నిలబడి ఉన్నాడు. స్వామివారు అతనివంక చూసి, "నాకు ఒక పని చేసిపెడతావా?" అని అడిగారు.

ఆ మాటలు వినగానే ఆ భక్తుని ఒళ్ళు పులకించిపోయింది. పరమాచార్య స్వామివారు తనను అలా అడగడం చూసి. తన మనసుని ప్రతిబింబిస్తున్నట్టుగా, "తమరు ఆజ్ఞాపించినట్టు" అని బదులిచ్చాడు.

"ఎనిమిది అణాలకి తమలపాకులు వక్కలు తీసుకుని వచ్చి అక్కడ ద్వారం వద్ద కూర్చున్న వ్యక్తికివ్వు" అని చెప్పారు.

ఆ భక్తుడు దగ్గర్లోని అంగడికి వెళ్ళి తమలపాకులు, వక్కలు తీసుకుని వచ్చాడు. అక్కడ కూర్చున్న ముసలాయనకు ఇచ్చి "తాతా ఇది తీసుకో" అని చెప్పాడు.

ఆ ముసలాయన ఆనందానికి అవధులు లేవు. సగం రాజ్యం ఇచ్చినా అతను ఇంతలా ఆనందపడేవాడు కాదేమో. అతని నవ్వు అతనికి ఉన్న కొన్ని పళ్ళను తెలుపుతున్నాయి. ***"నువ్వు మహారాజులా బ్రతుకు. కలకాలం సుసంపన్నంగా జీవించు. నీ పిల్లలు బాగుండాలి. ఈ ఆకు-వక్క లేక ఉదయం నుండి అల్లాడిపోతున్నాను. చూడు నేను ఎక్కడికీ కదలలేను. అంతేగాక కొనుక్కోవడానికి నా వద్ద డబ్బు కూడా లేదు. మహారాజులా బ్రతుకు నాయనా!!" అని చల్లగా ఆశీర్వదించాడు.***

స్వామివద్దకు వెళ్ళి పనిపూర్తి చేశాను అని చెప్పాడు.

"ఆ ముసలాయన ఏమన్నాడు?" అని అడిగారు. "చాలా సంతోషపడ్డాడు. సమయానికి ఇచ్చినందుకు ఆనందంతో నన్ను ఆశీర్వదించాడు"

"మహారాజులా బ్రతుకు! అని అన్నాడా?"

"అవును పెరియవ!"

***"చూడు!! ఎంతటి ఆశీర్వాదం పొందావో". స్వామివారు చెప్తూ ముందుకు కదిలి వెళ్ళారు.*** కాని ఆ భక్తునికి అర్థం కాలేదు ఎలా పరమాచార్య స్వామివారు ఆ ముసలాయన బాధని అర్థం చేసుకున్నారు కేవలం అటుగావెళ్తూ అతని వైపు ఒకసారి చూసి. నా వద్ద కూడా సమాధానం లేదు.

-- 'ఇన్ ద ప్రెజెన్స్ ఆఫ్ డివైన్' పరమాచార్య అనుభవాల సంగ్రహం

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం ॥

# 38. అధర్మం – అనారోగ్యం

రెండు కిడ్నీలు పనిచెయ్యడం లేదు. బ్రతకడం చాలా కష్టం. చాలా మంది నిపుణుల వద్ద చూపించుకున్నాడు. ఎంతో ధనం ఖర్చు చేశాడు, వాళ్ళు చెప్పిన మందులన్నీ వాడాడు. కాని ఏమి ఉపయోగం లేదు.

అతను మహాస్వామివారి వద్దకువచ్చితనబాధనంతాచెప్పుకున్నాడు. మామూలుగా అటువంటి బాధలతో వచ్చే వారిపై స్వామివారు చాలా కరుణ దయ చూపిస్తారు. వారితో ఎంతో అనునయంగా మాట్లాడుతారు. కాని ఆరోజు స్వామివారు తమ పలుకుల్లో కొంచం కాఠిన్యం వహించారు.

***"మనుషులు లెక్కలేనన్ని తప్పులు, అధార్మికమైన పనులు చేసి వాటికి ప్రతిఫలం అనుభవించాల్సి వచ్చినప్పుడు ఇక్కడకు వస్తారు. వారు చేసిన తప్పులను మాత్రం తెలుసుకోరు***. అందుకు నేనేమి చెయ్యగలను?" అని అన్నారు.

హఠాత్తుగా ఎందుకు మహాస్వామివారు ఇలా అంటున్నారో ఎవరికి అర్థం కావడంలేదు.

కొద్దిసేపటి తరువాత పరమాచార్య స్వామివారు మాట్లాడుతూ, "ఇతని పూర్వీకులు ధర్మాచరణకోసం, మంచిపనులు చెయ్యడం కోసం ఒక సంస్థను ఏర్పాటు చేశారు. అందుకోసం మంచి ఆదాయం వచ్చే భూమిని వదిలివెళ్ళారు. మంచినీటి బావులు తవ్వించడం కోసం, ధార్మికమైన పనులకోసం ఈ పని చేశారు. కాని ఇతను ఆ భూమిని అమ్మి వచ్చిన ధనాన్నంతా దాచుకున్నాడు" అని అన్నారు.

కిడ్నీ సమస్యతో వచ్చిన ఆ వ్యక్తి ఇదంతా విని తన తప్పిదాన్ని ఒప్పుకున్నాడు. "ఇప్పటినుండి నేను కూడా మంచినీటి బావులు తవ్వించి ధార్మికమైన పనులు చేస్తాను. నన్ను మన్నించి అనుగ్రహించండి పెరియవ" అని వేడుకున్నాడు.

మహాస్వామివారు వెంటనే కరుణాసముద్రులై "వసంబు(వస) తెలుసా నీకు? మూలికలు అమ్మే దుకాణాల్లో దొరుకుతుంది. దాన్ని బాగా నూరి రోజూ కడుపుకింది భాగంలో పూయి" అని సెలవిచ్చారు.

పదిపన్నెండురోజులతరువాత అతను మరలా వచ్చాడు. మహాస్వామివారుఅడగక ముందే అతను స్వామివారితో, "ఇప్పుడు ఏ బాధా లేదు" అని చెప్పాడు.

ధన్వంతరీ స్వరూపమైన ఆ సర్వేశ్వరుడే మందిచ్చిన తరువాత ఇంకా ఆ జబ్బు ఉంటుందా?

-- మహాపెరియవళ్ – దరిశన అనుభవంగళ్ 4

అపార కరుణాసింధుం జ్ఞానదం శాంతరూపిణం!
శ్రీ చంద్రశేఖర గురుం ప్రణమామి ముదావహం !!



## కనకధారా స్తోత్రమ్

## శ్రీ ఆదిశంకరాచార్య విరచితము

అంగంహరేః పులక భూషణమాశ్రయన్తీ,బృంగాంగనేవ ముకులాభరణం తమాలమ్!

అంగీకృతాఖిల విభూతి రపాంగలీలా,మాంగల్యదాస్తు మమమంగళ దేవతాయాః !!- 1

ముగ్ధా ముహుర్విదధతీ వదనే మురారేః,ప్రేమత్ర పాప్రణిహితాని గతాగతాని !

మాలాదృశోర్మధు కరీవ మహోత్పలేయా,సామేశ్రియం దిశతుసాగర సంభవాయాః !!- 2

ఆమీలితాక్ష మధిగమ్య ముదాముకుందమ్, ఆనందకంద మనిమేషమనంగ తంత్రం!

అకేకరస్థిత కనీనిక పక్ష్మనేత్రం, భూత్యై భవేన్మమ భుజంగ శయాంగనాయాః !!- 3

బాహ్వంతరే మధుజితశ్శ్రిత కౌస్తుభేయా, హారావళీవ హరినీలమయీ విభాతి !

కామప్రదా భగవతోపి కటాక్షమాలా, కళ్యాణమా వహతుమే కమలాలయాయాః !!- 4

కాలాంబుదాళి లలితోరసి కైటభారేః, ధారాధరే స్ఫురతియా తళిదంగనేవ !

మాతుస్సమస్త జగతాం మహనీయమూర్తిః, భద్రాణిమే దిశతు భార్గవనందనాయాః !!- 5

ప్రాప్తం పదం ప్రథమతఃఖలుయత్ప్రభావాత్, మాంగల్యభాజి మధుమాథిని మన్మథేన!

మయ్యాపతేత్ తదిహ మంథర మీక్షణార్థం, మందాలసంచమకరాలయ కన్యకాయాః !!- 6

విశ్వామరేంద్ర పదవిభ్రమ దానదక్షం, ఆనందహేతురధికం మురవిద్విషోపి!

ఈషన్నిషీదతుమయి ఈక్షణమీక్షణార్థం, ఇందీవరోదర సహోదరమిందిరాయాః !!- 7

ఇష్టావిశిష్టమతయోపి యయా దయార్ద్రదృష్ట్యా, త్రివిష్టపపదం సులభం లభంతే !

దృష్టిః ప్రహృష్ట కమలోదర దిప్తిరిష్టాం, పుష్టింకృషిష్ట మమపుష్కర విష్టరాయాః !!- 8

దద్యాద్దయాను పవనోద్రవిణాంబుధారా,అస్మిన్న కించన విహంగ శిశౌవిషణ్ణే !(two times)

దుష్కర్మఘర్మమపనీయ చిరాయదూరం, నారాయణ ప్రణయినీ నయనాంబువాహః !!- 9

గీర్దేవతేతి గరుడధ్వజ సుందరీతి, శాకంభరీతి శశిశేఖర వల్లభేతి !

సృష్టి స్థితి ప్రళయకేళిషు సంస్థితాయై ,తస్యై నమస్త్రిభువనైక గురోస్తరుణ్యై !!- 10

శ్రుత్యై నమోస్తు శుభకర్మ ఫలప్రశూత్యే ,రత్యై నమోస్తు రమణీయ గుణార్ణవాయై !

శక్త్యై నమోస్తు శతపత్రనికేతనాయై, పుష్ట్యై నమోస్తు పురుషోత్తమ వల్లభాయై !!- 11

నమోస్తు నాళీక నిభాననాయై, నమోస్తు దుగ్ధోదధి జన్మభూమ్యై !

నమోస్తు సోమామృత సోదరాయై, నమోస్తు నారాయణ వల్లభాయై !!- 12

నమోస్తు హేమామ్బుజపీఠికాయై, నమోస్తు భూమండల నాయికాయై !

నమోస్తు దేవాది దయాపరాయై ,నమోస్తు శార్ఙ్గాయుధ (sarngayudha)వల్లభాయై!!-13

నమోస్తు దేవ్యై భ్రుగునందనాయై , నమోస్తు విష్ణోరురసిస్థితాయై !

నమోస్తు లక్ష్మ్యై ( lakshmyai) కమలాలయాయై , నమోస్తు దామోదర వల్లభాయై !!- 14

నమోస్తు కాంత్యై కమలేక్షణాయై , నమోస్తు భూత్యై భువనప్రసూత్యై !

నమోస్తు దేవాదిభిరర్చితాయై ,నమోస్తు నందాత్మజవల్లభాయై !!- 15

సంపత్కరాణి సకలేంద్రియనందనాని, సామ్రాజ్యదాన విభవాని సరోరుహాక్షి !

త్వద్వందనాని దురితోద్ధరణోద్యతాని, మామేవ మాతరనిశం కలయంతు మాన్యే !!- 16

యత్కటాక్ష సముపాసనావిధిః! సేవకస్య సకలార్థ సంపదః !

సంతనోతి వచనాంగ మానసైః! త్వాం మురారి హృదయేశ్వరీం భజే !!- 17

సరసిజనిలయే ! సరోజహస్తే ! ధవళత మాంశుక గంధమాల్య శోభే !

భగవతి ! హరివల్లభే ! మనోజ్ఞే ! త్రిభువన భూతికరి ! ప్రసీద మహ్యం !!- 18(two times)

దిగ్ఘ స్తిభిః కనకకుంభముఖావ సృష్టస్వర్వాహినీమ్, విమలచారు జలప్లుతాంగిమ్ !

ప్రాతర్నమామిజగతాం జననీం,అశేష లోకధినాథగృహిణీమ్ అమృతాబ్ది పుత్రీమ్ !!- 19

కమలే ! కమలాక్ష వల్లభే !త్వం కరుణాపూర తరంగితైరపాంగైః !

అవలోకయమామ్ అకించనానాం ప్రథమంపాత్ర అకృతిమమ్ దయాయాః !!- 20

స్తువంతియే స్తుతిభిరమూభిరన్వహం, త్రయీమయీం త్రిభువనమాతరం రమామ్ !

గుణాధికా గురుతుర భాగ్యభాగినః, భవంతితే భువి బుధ భావితాశయాః !!- 21

**********

## శ్రీ శంకరాచార్య విరచిత – అన్నపూర్ణాస్తుతిః

**నిత్యానన్దకరీ వరాభయకరీ సౌన్దర్యరత్నాకరీ**
**నిర్ధూతాఖిలఘోరపావనకరీ ప్రత్యక్షమాహేశ్వరీ ।**
**ప్రాలేయాచలవంశపావనకరీ కాశీపురాధీశ్వరీ**
**భిక్షాం దేహి కృపావలమ్బనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ ౧॥**

*నిత్యమైన ఆనందము నిచ్చుదానవు, వరములను- అభయమును ప్రసాదించు దానవు, సౌందర్యసముద్రమైన దానవు, ఘోరమైన పాపముల నన్నిటినీ కడిగి వేయుదానవు, హిమవంతుని వంశమును పవిత్రము చేయుదానవు, కాశీపట్టణమునకు రాణివి, దయామయివి, తల్లివి, అన్నపూర్ణేశ్వరివి అగు నీవు భిక్షపెట్టుము.*

**నానారత్నవిచిత్రభూషణకరీ హేమామ్బరాడమ్బరీ**
**ముక్తాహారవిలమ్బమాన విలసత్ వక్షోజకుమ్భాన్తరీ ।**
**కాశ్మీరాగరువాసితా రుచికరీ కాశీపురాధీశ్వరీ**
**భిక్షాం దేహి కృపావలమ్బనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ ౨॥**

*వివిధ రత్నముల విచిత్రాభరణములను ధరించినదానవు, బంగారు వస్త్రములను కట్టుకున్న దానవు, వక్షస్థలముపై ప్రకాశించు ముత్యాల హారములు ధరించిన దానవు, కుంకుమ- అగరులు పూసుకొనుటచే సువాసనలు వేదజల్లు శరీరము కలదానవు, కాశి పట్టణమునకు రాణివి, దయామయివి, తల్లివి, అన్నపూర్ణేశ్వరివి అగు నీవు భిక్షపెట్టుము..*

**యోగానన్దకరీ రిపుక్షయకరీ ధర్మార్థనిష్ఠాకరీ**
**చన్ద్రార్కానలభాసమానలహరీ త్రైలోక్యరక్షాకరీ ।**
**సర్వైశ్వర్యసమస్తవాఞ్ఛితకరీ కాశీపురాధీశ్వరీ**
**భిక్షాం దేహి కృపావలమ్బనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ 3॥**

*యోగముచే పొందు ఆనందమును కలిగించుదానవు, శత్రువులను నాశనం చేయు దానవు, ధర్మనిష్ఠను ఏర్పరచుదానవు, చంద్రుడు- సూర్యుడు- అగ్నులతో సమానమైన కాంతి ప్రవాహమైనదానవు, మూడులోకములను రక్షించుదానవు, సమస్తైశ్వర్యములను ప్రసాదించుదానవు, తపస్సులకు ఫలమునిచ్చుదానవు, కాశీ పట్టణమునకు రాణివి, దయామయివి, తల్లివి, అన్నపూర్ణేశ్వరివి అగు నీవు భిక్షపెట్టుము..*

**కైలాసాచలకన్దరాలయకరీ గౌరీ ఉమా శఙ్కరీ**
**కౌమారీ నిగమార్థగోచరకరీ ఓఙ్కారబీజాక్షరీ ।**
**మోక్షద్వారకవాటపాటనకరీ కాశీపురాధీశ్వరీ**
**భిక్షాం దేహి కృపావలమ్బనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ ౪॥**

*కైలాస పర్వత గుహయందుడు దానవు, తెల్లని దానవు, ఉమాదేవివి, శంకరుని భార్యవు, కుమారివి, వేదార్ధమును భోధించు దానవు, ఒంకార బీజాక్షరస్వరూపము కలదానవు, మొక్షద్వారపు తలుపులను తెరచెడి దానవు, కాశీ పట్టణమునకు రాణివి, దయామయివి, తల్లివి, అన్నపూర్ణేశ్వరివి అగు నీవు భిక్షపెట్టుము..*

**దృశ్యాదృశ్య విభూతివాహనకరీ బ్రహ్మాణ్డభాణ్డోదరీ**
**లీలానాటకసూత్రభేదనకరీ విజ్ఞానదీపాఙ్కురీ ।**
**శ్రీవిశ్వేశమనః ప్రసాదనకరీ కాశీపురాధీశ్వరీ**
**భిక్షాం దేహి కృపావలమ్బనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ ౫॥**

*కనబడీ కనబడని మహిమలు కలదానవు, గర్భమునందు బ్రహ్మాండములను మోయుచున్న దానవు, లీలానాటకమునకు సూత్రధారివి, విజ్ఞానదీపమును వెలిగించుదానవు, పరమేశ్వరుని ఆనందింపచేయుదానవు, కాశి పట్టణమునకు రాణివి, దయామయివి, తల్లివి, అన్నపూర్ణేశ్వరివి అగు నీవు భిక్షపెట్టుము..*

**ఉర్వీ సర్వజనేశ్వరీ భగవతీ మాతాఽన్నపూర్ణేశ్వరీ**
**వేణీనీలసమానకున్తలధరీ నిత్యాన్నదానేశ్వరీ ।**
**సర్వానన్దకరీ సదాశుభకరీ కాశీపురాధీశ్వరీ**
**భిక్షాం దేహి కృపావలమ్బనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ ౬॥**

*భూమియందలి సమస్త జనులకు నాయకురాలవు, విజయమునిచ్చుదానవు, తల్లివి, దయాసముద్రమైనదానవు, స్త్రీమూర్తివి, నల్లని కురులు కలదానవు, నిత్యము అన్నదానము చేయుదానవు, సాక్షాత్తుగా మొక్షమునిచ్చుదానవు, ఎల్లప్పుడు శుభము కలిగించు దానవు, కాశీ పట్టణమునకు రాణివి, దయామయివి, తల్లివి, అన్నపూర్ణేశ్వరివి అగునీవు భిక్షపెట్టుము.*

**ఆదిక్షాన్తసమస్తవర్ణనకరీ శమ్భోస్త్రిభావాకరీ**

**కాశ్మీరా త్రిజలేశ్వరీ త్రిలహరీ నిత్యాఙ్కురా శర్వరీ ।**

**కామాకాఙ్క్షకరీ జనోదయకరీ కాశీపురాధీశ్వరీ**

**భిక్షాం దేహి కృపావలమ్బనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ ౭॥**

*"అ" కారము మొదలు "క్ష" కారము వరకు ఉన్న అక్షరముల సముదాయమైన దానవు, పరమేశ్వరునకు ప్రియురాలవు, శంకరుని భార్యవు, కాశ్మీర త్రిపురేశ్వరివి, మూడుకన్నులు కలదానవు, కాశీ పట్టణమునకు రాణివి, దయామయివి, తల్లివి, అన్నపూర్ణేశ్వరివి అగు నీవు భిక్షపెట్టుము.*

**దేవీ సర్వవిచిత్రరత్నరచితా దాక్షాయణీ సున్దరీ**

**వామే స్వాదుపయోధరా ప్రియకరీ సౌభాగ్య మాహేశ్వరీ ।**

**భక్తాభీష్టకరీ సదాశుభకరీ కాశీపురాధీశ్వరీ**

**భిక్షాం దేహి కృపావలమ్బనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ ౮॥**

*దేవివి, విచిత్రములైన సర్వరత్నములతొ అలంకరింపబడినదానవు, దక్షుని కుమార్తెవు, సుందరివి, యువతివి, మధురమైన పాలిండ్లు కలదానవు, ప్రియమునిచ్చుదానవు, కాశీ పట్టణమునకు రాణివి, దయామయివి, తల్లివి, అన్నపూర్ణేశ్వరివి అగు నీవు భిక్షపెట్టుము..*

**చన్ద్రార్కానలకోటికోటిసదృశా చన్ద్రాంశుబిమ్బాధరీ**

**చన్ద్రార్కాగ్నిసమానకుణ్డలధరీ చన్ద్రార్కవర్ణేశ్వరీ ।**

**మాలాపుస్తకపాశసాఙ్కుశధరీ కాశీపురాధీశ్వరీ**

**భిక్షాం దేహి కృపావలమ్బనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ ౯॥**

*కోట్లాదిచంద్రులు, సూర్యులు, అగ్నులతో సమానముగా ప్రకాశించుదానవు, సూర్యబింబము వలె ఎర్రనైన క్రింది పెదవి కలదానవు, చంద్రుడు, సూర్యుడు, అగ్నుల వలే ప్రకాశించు కుండలములు ధరించిన దానవు, చంద్రుడు, సూర్యుడు వంటి వర్ణము కలదానవు, కాశీ పట్టణమునకు రాణివి, దయామయివి, తల్లివి, అన్నపూర్ణేశ్వరివి అగు నీవు భిక్షపెట్టుము.*

**క్షత్రత్రాణకరీ మహాఽభయకరీ మాతా కృపాసాగరీ**
**సాక్షాన్మోక్షకరీ సదా శివకరీ విశ్వేశ్వరీ శ్రీధరీ ।**
**దక్షాక్రన్దకరీ నిరామయకరీ కాశీపురాధీశ్వరీ**
**భిక్షాం దేహి కృపావలమ్బనకరీ మాతాఽన్నపూర్ణేశ్వరీ ॥ ౧౦॥**

*వీరులను రక్షించుదానవు, మహాభయంకరివి, తల్లివి, దయా సముద్రమైన దానవు, అందరికీ ఆనందము కల్గించు దానవు, ఎల్లప్పుడు శుభము కల్గించు దానవు, విశ్వమునకు రాణిగాశోభిల్లుదానవు, దక్షప్రజాపతికి (యాగనాశనముద్వారా)దుఃఖమును కల్గించుదానవు, సుఖము నిచ్చుదానవు, కాశీ పట్టణమునకు రాణివి, దయామయివి, తల్లివి,అన్నపూర్ణేశ్వరివి అగు నీవు భిక్షపెట్టుము.*

**అన్నపూర్ణే సదాపూర్ణే శఙ్కరప్రాణవల్లభే ।**
**జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం భిక్షాం దేహి చ పార్వతి ॥ ౧౧॥**

*ఓ అన్నపూర్ణా! ఎల్లప్పుడు పూర్ణముగా ఉండు తల్లీ! శంకరుని ప్రాణవల్లభురాలా! పార్వతీమాతా! జ్ఞానము వైరాగ్యము సిద్ధించుటకు భిక్షపెట్టుము.*

**మాతా మే పార్వతీ దేవీ పితా దేవో మహేశ్వరః ।**
**బాన్ధవాః శివభక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్ ॥ ౧౨॥**

*తల్లియే పర్వతీదేవి , తండ్రియే పరమేశ్వరుడు, బంధువులు శివభక్తులు, మూడు లోకములే స్వదేశములయి ఉన్నారు.*

**॥ ఇతి శ్రీశఙ్కరభగవతః కృతౌ అన్నపూర్ణాస్తోత్రం సమ్పూర్ణమ్ ॥**

**********

*“ఎన్నడైతే శిష్యుడు తన్ను పూర్తిగా గురువునకు నివేదించుకొన్నాడో, ఆనాటినుండీ అతని భారం గురువుది. 'గురుదేవో మహేశ్వరః' గురుచరణములవద్ద  పూర్ణంగా స్వాత్మార్పణ చేసుకొన్న శిష్యుడిని దైవబలం అనుక్షణం రక్షిస్తూ ఉంటుంది. తమ లేఖలలో ఈ విషయాన్ని వివేకానందులవారు చర్వితచర్వణంగా ప్రస్తావించేవారు .”*

*“ఉద్యోగ వ్యాపారాలలో చిక్కుకొన్న మనకు తీవ్రమైన ఆధ్యాత్మిక సాధనలు చేయడానికి వ్యవధికానీ, అవకాశంకానీ ఉండదు. కానీ సంసారంలో అనుదినమూ ఎదుర్కొనే కష్టాలకూ, పరిష్కరించవలసిన సమస్యలకూ, కలిగే ధర్మసందేహాలకూ మనకొక సలహాదారుడు అవసరం. సాధన ముదిరే కొద్దీ భగవత్కృపచేత మనకు మార్గం గోచరిస్తూనే ఉంటుంది. ఆమాత్రం సదుపాయం కలుగడానికీ గురువు అవసరం. ఈ కాలపు జీవనవిధానంలో అన్ని వేళలా గురుసమక్షంలో ఉండటం జరుగనిపని. మనం ఎవరిని గురువుగా ఎన్నుకొంటామో వారి వాక్యాలే మనకు గురుస్వరూపం. ఆ గురుబోధలను మననం చేయడం, ఆచరించడమే  గురుసమక్షం. అందుచేత ఎన్ని మైళ్ళ దూరంలోఉన్నా గురుసమక్షం, గురుస్వరూపం మన కందరికీ అందుబాటులోనే ఉంటుంది.”*

***....... శ్రీ  కంచి పరమాచార్య***